# చందమామ




సంపుటి 104 ఏప్రిల్ 2001 సంచిక 4

## ఈ సంచికలో...



### ఈ నెల విశేషాలు



మానవధర్మం!
(బేతాళ కథలు)

యక్షపర్వతం





డబ్బుకంటే గొప్పది

భారత సంస్కృతి - చరిత్ర



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, No.82, Defence Officers Colony, Ekattuthangal, Chennai - 600 097. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

## మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ
ఏకైక బహుమతి



# చందమామ

వారి భాషల్లో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ,
కన్నడ, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం,
తమిళం, తెలుగు

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు
పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ
చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది
చిరునామాకు పంపండి:

SUBSCRIPTION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
82, Defence Officers Colony,
Ekkattuthangal, Chennai - 600 097.
E-mail : subscription@chandamama.org

సంపాదకుడు
విశ్వం

ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈక్కాట్టుతాంగల్,
చెన్నయ్ - 600 097.
టెలిఫోన్/ఫ్యాక్స్ :
2347384, 2347399
E.mail:
chandamama@vsnl.com

**For USA**
**Single copy $2**
**Annual subscription $20**
***Intending subscribers in the USA and Canada can mail their remittances to :***
**INDIA ABROAD**
**43 West 24th Street**
**New York,**
**NY 10010**
**Tel: (212) 929-1727**
**Fax (212) 627-9503**
**E-mail:mail@indiaabroad.com**

సంచాలకులు

చక్రపాణి. బి.నాగిరెడ్డి

# రాష్ట్రపతి ప్రసంగం!

బడ్జెట్ సమావేశాల ప్రారంభం సందర్భంగా పార్లమెంటు ఉభయ సభల సంయుక్త సమావేశంలో రాష్ట్రపతి ప్రసంగించడం ఆనవాయితీ. ఈ ఆన వాయితీ ప్రకారం రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ ఫిబ్రవరి 19వ తేదీ పార్ల మెంటులో ప్రసంగించారు.

రంజాన్ మాసాన్ని ఉద్దేశించి కాశ్మీరు సరిహద్దులో భారతదేశం స్వచ్ఛం దంగా కాల్పుల విరమణ ప్రకటించింది. రెండుసార్లు దానిని పొడిగించింది. మొదట ఏకపక్ష కాల్పుల విరమణను ప్రకటించినప్పుడు మన ప్రధాని-దీనికి పాకిస్తాన్ సానుకూలంగా స్పందించగలదనీ, తద్వారా కాశ్మీరులో శాంతి స్థాపనకు ద్వైపాక్షిక చర్చలు జరపవచ్చునీ తన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. దురదృష్టవశాత్తు అలాంటిదేమీ జరగకపోగా, దీనినే అలుసుగా తీసుకుని అమాయక ప్రజల మీదా, శాంతి భద్రతలను పరిరక్షించడానికి పాటుపడే పోలీసుల మీదా, రక్షణా శిబిరాల మీదా దుశ్చర్యలకు పూనుకోవడం జరి గింది. ఇది మానవత్వానికే మచ్చ తెచ్చే దారుణ చర్య అని రాష్ట్రపతి ఖండిం చారు.

జనవరి 26వ తేదీ గుజరాత్‌లో జరిగిన భీకర భూకంపం గురించి ప్రస్తా విస్తూ-దేశంలో ఇలాంటి ఘోర విపత్తులు సంభవించినప్పుడు వాటిని ఎదు ర్కొనేందుకు మరింత సమర్థమైన, ఆధునిక యంత్రాంగం అవసరముందని ఆయన సూచించారు.

మహిళా రిజర్వేషన్ బిల్లును ఆమోదించేలా పార్టీలన్నీ ఏకాభిప్రాయానికి రావాలని రాష్ట్రపతి పిలుపునిచ్చారు. మహిళాభ్యున్నతి సంవత్సరానికి ఇవ్వ తగిన కానుక ఇదేనని ఆయన ఉద్ఘాటించారు.

ఐ.ఐ.టి.వంటి ప్రతిష్ఠాత్మకమైన విద్యాసంస్థలలో సీట్ల సంఖ్య పెంచాలనీ, 'అందరికీ ఆరోగ్యం' అనే లక్ష్యాన్ని సత్వరంగా సాధించడానికి వీలుగా నూతన ఆరోగ్య సిద్ధాంతాలు రూపొందించుకోవాలనీ రాష్ట్రపతి తన ప్రసంగంలో సూచించారు!



# అభినందనలు!

చందమామ సంపాదక వర్గ సలహాదారుడు శ్రీమనోజ్ దాస్ గారికి ఈ యేడు పద్మశ్రీ అవార్డు లభించింది. ఈ విషయం గురించి ఇక్కడ చదివేసరికే ఈ వార్త టీవీల ద్వారా,పత్రికల ద్వారా మీకు తెలిసే ఉంటుంది. ఇది చందమామ సంస్థకూ, పాఠకులకూ ఆనందం కలిగించే విషయం. ఇది మన మందరం గర్వించతగ్గ సమయం!



సృజనాత్మక రచనలకు మన దేశంలో ఇచ్చే ప్రతిష్ఠాత్మక 'సరస్వతీ సమ్మాన్' కూడా ఈయేడు శ్రీ మనోజ్‌దాస్‌గారికి లభించడం మరింత ఆనందకరమైన విషయం!

మన ప్రచురణాసంస్థతో శ్రీమనోజ్‌దాస్‌గారు గత ముప్ఫై సంవత్సరాలుగా సంబంధం కలిగి ఉన్నారు. తన పేరుతోనూ, రకరకాల కలంపేర్లతోనూ అనేక శీర్షికా రచనలూ, కథలూ ఆయన చందమామకు అందిస్తున్నారు. చందమామ సంస్థనుంచి వెలువడిన ఆంగ్లపత్రిక 'ది హెరిటేజ్' వ్యవస్థాపక సంపాదకులుగానూ ఉన్నారు.

ఒరిస్సా రాష్ట్రంలోని ఒక సంపన్న కుటుంబంలో 1934వ సం॥లో జన్మించిన మనోజ్‌దాస్ పిన్న వయసు నుంచే అనేక బాధాకరమైన అనుభవాలను ఎదుర్కోవలసి రావడంతో ఆయనలో తాత్విక చింతన ఆరంభమయింది. అసలు మనిషి అన్నవాడికి నిజమైన ఆనందం సాధ్యమా? అన్న ప్రశ్న ఆయనలో కలిగింది. క్రమేణా ఆయన శ్రీఅరవిందులు, శ్రీమాత పట్ల ఆకర్షితులయ్యారు. ఆఖరికి 1963వ సం॥లో పాండిచ్చేరి శ్రీఅరవింద ఆశ్రమంలోనే స్థిరపడ్డారు. శ్రీ అరవింద అంతర్జాతీయ విద్యాకేంద్రంలో ఉపన్యాసకులుగా ఉంటున్నారు.ఒరియాలోనూ,ఆంగ్లంలోనూ మంచి రచయితగా పేరుగాంచిన ప్రొఫెసర్ దాస్ 1949వ సం॥లో అంటే తన 19వ యేట ఒరియా కవితాసంకలనంతో సాహితీరంగ ప్రవేశం చేశారు. సాటిలేని మన భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను గురించి రాయడం అంటే ఆయనకు వెన్నతో బెట్టిన విద్య. ఆయన సాహితీ సేవలకు గుర్తింపుగా, సాహిత్య అకాడెమీ అవార్డు (1972), సరళా అవార్డు (1980), సాహిత్య భారతి అవార్డు (1994) మొదలైన సత్కారాలు లభించాయి. సింగపూర్ ప్రభుత్వానికి ఆయన కొన్నేళ్ళు విద్యారంగ సలహాదారుగా ఉన్నారు.

1997లో చందమామ స్వర్ణోత్సవాల సందర్భంగా మన సంస్థ ఏడు ఆంగ్ల గ్రంథాలను ప్రచురించింది. వాటిలో ఆరు మనోజ్‌దాస్ రచనలు.

ఏడవ పుస్తకాన్ని మరో సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత రస్కిన్ బాండ్ రచించారు. ఆయన కూడా మన చందమామ సంపాదకవర్గ సలహాదారుడు.ఆయననూ భారత ప్రభుత్వం 1999లో పద్మశ్రీ అవార్డుతో సత్కరించింది.



1934వసం॥లో జన్మించిన రస్కిన్‌బాండ్ తన బాల్యాన్ని ఇంగ్లాండులో గడిపారు. పిన్న వయసులోనే రచనా వ్యాసంగాన్ని చేపట్టారు. సాహిత్య అకాడెమీ అవార్డు, ఉత్తమ బాలసాహిత్యానికి అందజేసే ప్రతిష్ఠాత్మక క్రిస్టియన్ ఆండర్సన్ అవార్డు (1998) మొదలైన పలు సత్కారాలను పొందారు.కొండలూ, నదులూ నేపథ్యంగా సాగే మన దేశప్రజల జీవనవిధానాన్ని గురించి రాయడం అంటే బాండ్‌కు ఎంతో ఇష్టం. గత ఒక సంవత్సరకాలంగా ఇంగ్లీషు చందమామలో ఆయన రచనలు వెలువడుతున్నాయి.

ప్రొఫెసర్ మనోజ్ దాస్, రస్కిన్ బాండ్‌లకు చందమామ సంస్థ తరుఫున, పాఠకుల తరుఫున హృదయ పూర్వక అభినందనలు తెలియజేస్తూ, వారినుంచి మునుముందు మరిన్ని మంచి రచనలనూ, సలహాలనూ ఎదురు చూస్తున్నాం!

—ప్రచురణకర్త




## బాలరచయితలకూ, చిత్రకారులకూ ఆహ్వానం!

# పిల్లల ప్రత్యేక సంచిక గా వెలువడనున్న

## నవంబర్ 2001 చందమామకు మీ రచనలనూ, చిత్రాలనూ పంపండి!

<u>బాలరచయితలకు</u>  ఐదువందల నుంచి, వెయ్యి పదాలకు మించకుండా చక్కని కథలను ఆలోచించి రాసి, మంచి పేరు పెట్టి పంపండి. లేదా పజిల్స్, జోక్స్, పొడుపుకథలు రాసి పంపండి. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, హిందీ, బెంగాలీ, ఒరియా, మరాఠీ, గుజరాతీ, ఇంగ్లీషు భాషలలో ఏ భాషలోనైనా సరే ఒక్కొక్కరు మూడు ఎంట్రీల వరకు పంపవచ్చు. మీ రచనలకు చిత్రాలు/వర్ణచిత్రాలు వేయగల మిత్రులు గనక మీకు ఉన్నట్టయితే, వాళ్ళ చేత తగిన చిత్రాలు గీయించి మాకు పంపండి. అవి బావున్నట్టయితే, మీ మిత్రులను మా ఖర్చులతో చెన్నయ్‌కి రప్పించి, వాళ్ళచేత ప్రత్యేక సంచికకు ఎంపికయిన రచనలకు చిత్రాలు వేయిస్తాం.

<u>బాలచిత్రకారులకు</u>  సుప్రసిద్ధ పౌరాణిక దృశ్యాన్ని గాని, చారిత్రక ఘట్టాన్ని గాని (దాని వివరణతో) చిత్రంగా/వర్ణచిత్రంగా వేసి మాకు పంపాలి. ఒక్కొక్కరు మూడు ఎంట్రీల వరకు పంపవచ్చు. వచ్చిన వాటిలో ఉత్తమమైన వాటిని ఎంపిక చేసి, వాటిని వేసి పంపిన చిత్రకారులను చెన్నయ్‌కి మా ఖర్చులతో రప్పించి, ప్రత్యేక సంచిక కోసం ఎంపికయిన కథలకూ, అంశాలకూ వాళ్ళచేత చిత్రాలు వేయిస్తాం. **ఎంట్రీలు మాకు చేరవలసిన ఆఖరు తేది: జూన్ 7, 2001.**

**బహుమతులు :** ప్రతిభావంతమైన ప్రయత్నాలకు ఆకర్షణీయమైన బహుమతులు ఉంటాయి.

**ఫోటో :** మీ ఎంట్రీలతో పాటు పాస్‌పోర్ట్ సైజు మీ ఫోటో ఒకటి జతచేసి పంపండి.

హామీ పత్రం: ఈ పోటీలో పాల్గొనే బాలబాలికలు కింది కూపన్‌లో మీ తల్లి/తండ్రి సంతకం తీసి పంపడం మరిచిపోకండి.

పేరు : ........................................................ ..............వయసు/పుట్టిన తేదీ : ......................

తరగతి : ................. పాఠశాల : ..........................................................................

ఇంటి చిరునామా : ..........................................................................................

..........................................................................................................

........................................................................ పిన్‌కోడ్ : ..............................

ఎంట్రీల వివరాలు :-

1. ..........................................................................
2. ..........................................................................
3. ..........................................................................

పైన కనబరచిన ఎంట్రీలు మా అబ్బాయి/అమ్మాయి స్వయంగా మరెవ్వరి సాయం లేకుండా రాసినవి/వేసినవి అని ధ్రువ పరుస్తున్నాను. ఎంపికయిన ఎంట్రీలను తెలుగు భాషలోనూ, ఇతర భాషలలోనూ ప్రచురణ మరియు ఎలక్ట్రానిక్ మీడియాలో వాడుకునే పూర్తి కాపీ రైట్ చందమామకే చెందుతుందని ఇందుమూలంగా సమ్మతిస్తున్నాను.

పాల్గొనే అబ్బాయి/అమ్మాయి సంతకం.  తల్లి/తండ్రి సంతకం

[వెనక వైపున ఉన్న ఫారాన్ని పూర్తి చేసి పంపండి]

I. మీరు చందమామ చందాదారులా? అవును అన్నట్టయితే మీరు ఏ భాషలో చందమామను చదువుతారో తెలియ జేయండి:

..........................................................

II.చందాదారు కాని పక్షంలో చందమామ కాపీ మీకు ఎలా లభిస్తుందో (✓) గుర్తు ద్వారా తెలియజేయండి

పత్రికలమ్మేవారి దగ్గర : ......................

గ్రంథాలయంలో : ..............................

మిత్రుల ద్వారా : ..............................

III. మీ కాపీని ఎందరు చదువుతారు?

..........................................................

IV. చందమామలో మీకు ఏఏ శీర్షికలంటే ఇష్టమో ప్రాధాన్యతా క్రమంలో తెలియజేయండి :-

1..........................................................

2..........................................................

3..........................................................

4..........................................................

5..........................................................

6..........................................................

V. చందమామలో లేనివి, ఏఏ శీర్షికలు ఉంటే బావుంటుం దని మీరు ఆశిస్తున్నారు?

1..........................................................

2..........................................................

3..........................................................

4..........................................................

VI. ఏ రకం చిత్రాలంటే మీకు బాగా ఇష్టం? (సంచిక తేదీ, సంచికలోని కథ/శీర్షిక పేరు సూచించండి.) :-

..........................................................

..........................................................

..........................................................

..........................................................

..........................................................

VII. గత ఆరు సంచికలలో మీకు బాగా నచ్చిన ముఖచిత్రం ఏది? (భాష, సంచిక తేదీ సూచించండి) :

..........................................................

VIII. ఎ) మీ తల్లి తండ్రుల వృత్తి/ఉద్యోగం :

తండ్రి : ..................................................

తల్లి:......................................................

బి) కుటుంబ ఆదాయం (నెలసరి ) ( ✓ )గుర్తు పెట్టండి.

రూ.5,000 : ..............................................

రూ.5,001—10,000 : ..................................

రూ.10,000 కన్నా ఎక్కువ : ............................

IX మీరు ఏ టీవీ కార్యక్రమాలు చూస్తారు?

దూరదర్శన్ : ..........................................

శాటలైట్ చానల్ : ......................................

X మీ ఇంట్లో ఉన్న టీవీ ... .. ..................?
బ్లాక్ అండ్ వైట్.. ... .........కలర్.... .. ............

XI మీరు బడికి ఎలా వెళతారు? ( ✓ ) గుర్తు పెట్టండి

స్కూలు బస్సులో : ......................................

సిటీ బస్సులో : ..........................................

సొంత వాహనంలో:

సైకిలు/స్కూటర్ : ......................................

ఆటో/కారు : ..........................................

మిమ్మల్ని స్కూల్లో ఎవరు దిగబెడతారు?

తల్లి తండ్రులు:..........................................

డ్రైవర్ : ..................................................

XII మీరు మరే ఇతర పిల్లల పత్రికకైనా చందాదారులుగా ఉన్నారా? పుస్తకాలు కొంటారా?............................

పత్రిక పేరు:..................పుస్తకాలు..................

XIII మీరు దినపత్రికను చదువుతారా?

పత్రిక పేరు : ..........................................

బేతాళ కథలు

# మానవధర్మం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, రాచ పుట్టుక వారికి ఉగ్గుపాలతోనే శౌర్య ధైర్యాల్నీ, సాహసవిద్యల్నీ నేర్పడం సహజమే. అలాంటి వారు నీలాగే రాత్రనకా, పగలనకా లక్ష్యసాధన కోసం నిర్విరామ కృషి చేయగల ధీరోదాత్తులవుతారు. అయితే, తీరా లక్ష్యం సిద్ధించనున్న సమయంలో, కొంతమంది చిత్త చాంచల్యానికిలోనై, వారి అదృష్టాన్ని వారే దురదృష్టంగా మార్చుకోవడం జరుగుతుంది. గతంలో- ఉద్దండ



దేశానికి భావిమహారాజు అయిన శృత వర్మకూడా, ఇటువంటి మానసిక వైపరీ త్యానికిలోనై, తనకుదక్కిన అమూల్యా వకాశాన్ని జారవిడుచుకున్నాడు. అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం ప్రవాళదేశాన్నిపాలించిన మరుత్త వర్మకు, లేకలేక ఒకేఒక ఆడపిల్ల కలిగింది. నిండుపున్నమి నాటి రాత్రి జన్మించిన ఆ బిడ్డకు మరుత్తవర్మ, కౌముది అని నామ కరణం చేశాడు. యుక్త వయసువచ్చే నాటికి కౌముది అద్వితీయ సౌందర్యరాసిగానూ, అసమాన మేధావిగానూ పేరుగాంచింది.

కౌముదిని పెళ్ళాడబోయే వ్యక్తి, ప్రవాళ దేశానికి కాబోయే పాలకుడు కూడా అవు తాడన్న విషయాన్ని బాగా మనసుపట్టించు కున్న మరుత్తవర్మ కౌముదికి కాబోయే భర్తను, ఆమె బాల్యంలోనే నిర్ణయించాడు. ఆ వరుడు, మరుత్తవర్మకు స్వయానా చెల్లెలి కొడుకూ, భావి ఉద్దండదేశపు మహారాజూ అయిన శృతవర్మ.

శృతవర్మ ప్రవాళదేశం వచ్చినప్పుడల్లా, అతడి విద్యాభ్యాసం రాజగురువు ముకుందా చార్యుల వద్దే సాగేది. ముకుందాచార్యుల వద్ద శృతవర్మతో పాటు కౌముది, మణి మంతుడు కూడా విద్యనభ్యసించేవారు. మణిమంతుడు, రాజుమరుత్తవర్మ ప్రధాన మంత్రి అయిన రత్నకేసరి కుమారుడు. బాల్యదశ పూర్తయ్యేవరకూ ముగ్గురూ ఒకే గురువు వద్ద విద్యాభ్యాసం చేశారు. ఆ సమయంలో కౌముదీ, మణిమంతుల మధ్య తరచూ వాద ప్రతివాదాలు సాగుతూండేవి. పరస్పర గౌరవాభిమానాల్ని చెక్కుచెదర నివ్వకుండా, విషయాన్ని పక్కదారికి పట్ట నివ్వకుండా సాగే వారి చర్చలు, ముకుందా చార్యులకు సంతోషాన్ని కలిగించేవి. మధ్యలో శృతవర్మ కల్పించుకున్నప్పటికీ, అతడి వాదనా పటిమ కడదాకా సాగేదికాదు.

బాల్యదశదాటగానే కౌముది విద్య అంతః పురంలోనే కొనసాగడం ప్రారంభించింది. అయితే, తండ్రి ప్రోద్బలంవల్ల ఆమె పురుష వేషం ధరించి, మిగిలిన ఇద్దరూ అభ్యసిస్తున్న శస్త్రవిద్యల్ని తాను కూడా అభ్యసించింది. ఆ విధంగా, వారి ముగ్గురి మైత్రీ నిరాటంకంగా సాగుతూవచ్చింది.

కాబోయే అల్లుడుగా శృతవర్మనూ, మేధావిగా మణిమంతుణ్ణీ అభిమానించిన మహారాజు వారిద్దరికీ తన కుమార్తెతో ఏర్పడిన సన్నిహిత మైత్రిని చూసి కాస్త కలవరపడ్డాడు.

శృతవర్మకంటే మణిమంతుడు అందం లోనూ, శస్త్రవిద్యల్లోనూ అధికుడు. రాజ్యం లేదన్నలోపం తప్పితే ఉత్తమక్షత్రియపుత్రుడు. ఇప్పుడు తన కుమార్తెగాని మణిమంతుడి మైపు ఆకర్షింపబడి వుంటే, తాను చాలా ఇక్కట్ల పాలవుతాడు. శృతవర్మను తను అల్లుణ్ణి చేసుకుంటాడని, అతడి తల్లిదండ్రులిద్దరూ పూర్తిగా విశ్వసిస్తున్నారు. శృతవర్మకూడా కౌముదిపై ప్రేమాభిమానాలను కనబరుస్తున్నాడు.

ఈ విషయాలన్నీ బాగా ఎరిగిన మరుత్త వర్మ, ఇప్పుడు పరిస్థితి గనక మారితే పర్యవసానం ఎలా వుంటుందో అని భయపడి, ముందుగా కౌముది మనసు గ్రహించుకు రమ్మని, చతురురాలైన ఒక చెలికత్తెను ఆదేశించాడు. మాలతి అనే ఆ చెలికత్తె ఒక రెండు నెలలపాటు కౌముదికి సఖిగా వ్యవహరించి, కౌముది, శృతవర్మను కేవలం బంధువుగా మాత్రమే అభిమానిస్తున్నదనీ, ఆమె త్రికరణ శుద్ధిగా భర్తగా కోరుకుంటున్నది మణిమంతుడినేననీ నమ్మకంగా తేల్చి చెప్పింది. కౌముది తాలూకు ఈ నిర్ణయం వెనక, మణిమంతుడి పట్లగల విశేషాభిమానమేకాక,మాతృదేశాభిమానం కూడా వున్నట్టు మాలతి వివరించింది.

ఎవరినిపెళ్ళాడినా,వారి స్వదేశానికి రాణిగా తాను తరలి వెళ్ళక తప్పదనీ, అదే మణిమంతుడైతే, వారసులులేని ప్రవాళ రాజ్య సింహాసనాన్ని ఎవరో రాజప్రతినిధులకు అప్పగించే బదులు తామే అధిష్ఠించి పాలన సాగించవచ్చుననీ కౌముది అభిప్రాయ పడుతున్నట్టు మహారాజు,మాలతి మాటలద్వారా



గ్రహించాడు.తాను భయపడుతున్నదే సత్యం కాబోతున్నదని తెలుసుకున్న మహారాజుకు ఒక్క క్షణం నవనాడులూ స్తంభించాయి. ఆ క్షణం నుంచి కౌముది వివాహ విషయం ఆయనను తీవ్రంగా కలవరపరచటం ప్రారంభించింది.

అయితే, మహారాజుకు ఈ సందర్భంగా తెలియని విషయం మరొకటివుంది. అది, శృతవర్మ కూడా కౌముది మనోగత అభిప్రాయాన్ని గ్రహించిన విషయం. జ్ఞానం వచ్చింది మొదలు కౌముదిని తన భార్యగా మనసులోనే పరిగణిస్తూ వచ్చిన శృతవర్మకు, కౌముదీ, మణిమంతుల పరస్పరాభిమానం సహజంగానే గొడ్డలిపెట్టు అయింది. అతడు ఈ విషయమై తీవ్రంగా ఆలోచించి, చివరకు వెళ్ళి మేనమామను కలుసుకుని, తనకు తెలిసిన విషయాలన్నీ చెప్పాడు.



సనం రెండూ దక్కుతాయి!' అని చెప్పు. నూటికి నూరుపాళ్ళూ మణిమంతుడు ఈ ప్రతిపాదనకు అంగీకరిస్తాడు. నువ్వు నీ సర్వశక్తుల్నీ వినియోగించి కౌముదిని నీ భార్యగా చేసుకో. ఒకవేళ నువ్వు గెలవటం అసాధ్యమయ్యే పరిస్థితే గనక ఎదురైతే, అప్పుడు నేను ఏదో ఒక చతురోపాయాన్ని ఆలోచించి,నువ్వు గెలిచేటట్టుచేస్తాను.నువ్వు గెలిచాక, నీకూ మణిమంతుడికీ మధ్య జరిగిన సంభాషణ యావత్తూ కౌముదికి చెప్పు. కౌముది కూడా మారు మాట్లాడకుండా, నిన్ను భర్తగా అంగీకరిస్తుంది,'' అంటూ వివరించాడు.

ఆ తర్వాత కొద్దిరోజులపాటు ఏమి చేయటమా అని ఆలోచించిన మహారాజు, మేనల్లుణ్ణి పిలిపించి, ''నాయనా, శృతవర్మా! కౌముది వివాహ విషయం గురించి నేను చాలా లోతుగా ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చాను. నువ్వు రేపే మణిమంతుణ్ణి కలుసుకుని, కౌముదిని అతడు అభిమానిస్తున్న విషయం నువ్వు గ్రహించినట్టు చెప్పు. తర్వాత, అతడితో, 'మణిమంతా! కౌముదిని నువ్వెంతగా అభిమానిస్తున్నావో, నేనూ అంతగానే అభిమానిస్తున్నాను.వరులుగామనిద్దరికీ సమాన అర్హతలే ఉన్నప్పటికీ, బంధుత్వం నాకొక అదనపు అర్హత. అయినప్పటికీ నేను ఆ అర్హతను ఉపయోగించుకోదలచ లేదు. అందుచేత మనిద్దరం యుద్ధవిద్యల్లో మన బలాబలాల్ని తేల్చి చూసుకుందాం. గెలిచినవాడికి కౌముది, ప్రవాళదేశ సింహా

మేనమామ మాటలకు శృతవర్మ కొద్ది క్షణాలు ఆలోచించి, ''మామయ్యా!ఉన్నది ఉన్నట్టుచెప్పాలంటే, మేమిద్దరం సమాన నైపుణ్యంగల యోధులమైనప్పటికీ, మణిమంతుడికి సహజాభరణంగా అబ్బిన ఆత్మవిశ్వాసం, అతడికి రెట్టింపు శౌర్యధైర్యాలను ప్రసాదిస్తూవుంటుంది. అందుచేత, మనం ఒక పని చేద్దాం. ఆరావళీ పర్వత ప్రాంతంలో గురుకులాన్ని నెలకొల్పిన కృష్ణచంద్రుడనే గురువు పేరు నువ్వు వినేవుంటావు. భావి మహారాజులకు ఆయన శస్త్రశాస్త్రాల్లో ప్రత్యేక శిక్షణ ఇస్తాడు. నేను రేపే బైలుదేరి వెళ్ళి, కృష్ణచంద్రుడి శిష్యరికంలో మరింత సామర్థ్యాన్ని పొంది వస్తాను! అప్పుడు నువ్వు చెప్పినట్టే చేద్దాం!'' అన్నాడు.

మహారాజు, శృతవర్మ మాటలకు అంగీకారం తెలిపాడు.

అనుకున్న ప్రకారం మర్నాడే శృతవర్మ, కృష్ణచంద్రుడి వద్దకు బైలుదేరివెళ్ళి, ఆరు



నెలలపాటు ఏకాగ్రతతో శిష్యరికం చేశాడు. అతడి శిక్షణ పూర్తయి, అతడు తిరిగి వెళ్ళే నాటికి ముందు రోజు సాయంత్రం కృష్ణ చంద్రుడు అతణ్ణి దగ్గర కూర్చోబెట్టుకుని, వీడ్కోలు మాటలు ఒకటి రెండు చెప్పి, "అన్నట్టు, ప్రవాళదేశపు మహారాజు నీ మేనమామ అని చెప్పావు గదా! ఆ దేశపు ప్రధాన మంత్రి కుమారుడు మణిమంతుడితో, నీకేమైనా పరిచయం వున్నదా?" అంటూ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు ఆశ్చర్యపోయిన శృతవర్మ, "మణిమంతుడా!బాగానే పరిచయం వున్నది. ఆ ప్రశ్న ఎందుకడిగారు, స్వామీ?" అంటూ అప్రయత్నంగా తిరిగి ప్రశ్నించాడు.

కృష్ణచంద్రుడు మందహాసంచేసి, "నాకు, అప్పుడప్పుడూ నేనెవరన్న విషయం ప్రజలకు తెలియనివ్వకుండా దేశసంచారం చేసే అల వాటున్నది. నువ్వు నా దగ్గరకు శిష్యుడిగా రావటానికి పక్షంరోజులక్రితమే ప్రవాళదేశంలో వసంతోత్సవాలు జరిగాయి. ఆ సమయంలో నేను అక్కడ వుండడంచేత, ఉత్సవ సంద ర్భంగా యుద్ధవిద్యల్ని ప్రదర్శించినవారిలో, మణిమంతుడి అపూర్వ విన్యాసాల్ని చూడ గలిగే అదృష్టం కలిగింది. అచంచల ఆత్మ విశ్వాసంతో మణిదీపంలా ప్రకాశించగలిగే యోధులకు తప్ప అన్యులకు సాధ్యంకాని విన్యాసాలన్నీ ఆ కుర్రవాడి చేతుల్లో మెరుపు తీగల్లా కదిలాయి. మణిమంతుణ్ణి నేనుఆహ్వా నిస్తున్నానని చెప్పు! ఒకసారి ఆశ్రమానికి వచ్చి వెళ్ళమను," అన్నాడు.

గురువు మాటలతో శృతవర్మ కంఠం కొద్ది క్షణాలు మూగబోయింది. చివరికతడుగొంతు

పెగల్చుకుని, ''ఆ రోజు యుద్ధ విన్యాసాలు ప్రదర్శించినవారిలో నేనూ వున్నాను,స్వామీ!'' అన్నాడు నీరసంగా.

శృతవర్మ మాటకు కృష్ణచంద్రుడు ఆశ్చర్యంగా, ''అవునా!'' అని నవ్వివూరుకున్నాడు.

ఆ మరుసటిరోజు బైలుదేరిప్రవాళదేశానికి తిరిగివచ్చిన శృతవర్మ, మేనమామను కలుసుకుని, ''మామయ్యా! కృష్ణచంద్రుడి శిష్యరికంలో నా సామర్థ్యమూ, ఆత్మవిశ్వాసమూ కూడా బాగా పెరిగాయి. కాని, బంధువు నన్న పేరుతో కౌముది కోరికకు వ్యతిరేకంగా ప్రవర్తించడం అంతన్యాయం కాదనిపిస్తున్నది. నా మాట విని, కౌముదీ మణిమంతులిద్దరికీ వివాహం జరిపించు!'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, నేను నీకు మొదటే చెప్పినట్టు, శృతవర్మ తన ఆరు నెలల కఠిన పరిశ్రమనూ నిర్వీర్యం చేసుకుని, లక్ష్యం ఫలించబోయే తరుణంలో చిత్తచాంచల్యానికిలోనై తనకు దక్కబోయే అదృష్టాన్ని కాలదన్నుకున్నాడుగదా? అంతటి అవివేకి మరెక్కడైనా వుంటాడా?ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తనంత తానుగా కృష్ణచంద్రుడి శిష్యరికాన్ని స్వీకరించినవాడు శృతవర్మ. అట్టి గొప్ప గురువు ఆహ్వానాన్ని పొందినవాడు మణిమంతుడు. నేను కూడా యుద్ధ విద్యల్ని ప్రదర్శించాను అంటూ శృతవర్మ స్వయంగా చెప్పినప్పటికీ, అతడిని ఏవిధంగానూఅందలం ఎక్కించని కృష్ణచంద్రుడు, దాదాపుగా ఏడు నెలల క్రితం తాను చూసిన మణిమంతుడి విన్యాసాల్ని, ఆ క్షణం కళ్ళముందు కదులుతున్నట్టుగా వర్ణించాడు. కృష్ణచంద్రుడి ఈ రకమైన ప్రవర్తన, శృత వర్మకూ, మణిమంతుడికీ గల ముఖ్యమైన స్థాయీభేదాన్ని శృతవర్మకు విప్పి చెప్పింది. దాంతో అంతర్మథనానికి లోనైన శృతవర్మ, మణిమంతుణ్ణి వరించిన కౌముది ఉత్తమ సంస్కారానికి తను తగిన వరుణ్ణి కాననే నిర్ణయానికి వచ్చాడు. అది చిత్తచాంచల్యం ఏమాత్రమూ కాదు. రాజనీతినీ, మానవ ధర్మాన్నీ పాటించటం అవుతుంది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : లక్ష్మీగాయత్రి రచన]





# యక్షపర్వతం

## 4

[మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ తరుముకుంటూ పోయిన ఖడ్గజీవదత్తులకు, గుహలో వాళ్ళు కనిపించలేదు. ఆ ఇద్దరూ ఒక రహస్య సొరంగమార్గం గుండా పోయి, పెద్ద పెద్ద శిథిల భవనాలున్న చోటు చేరారు. ఆ భవనాల్లో వున్న పూజారిణి, ఖడ్గజీవదత్తులను బంధించమని మాంత్రికుణ్ణి ఆజ్ఞాపించింది. వాడు కత్తి తీసుకుని జడలభూతాన్ని వెంటబెట్టుకుని బయలుదేరాడు. తరవాత-]

తమ ముందున్న శిథిల భవనాలకేసి కన్నార్పకుండా చూస్తూ జీవదత్తుడు, అవి ఏకాలం నాటివైవుండొచ్చు,ఏ కారణంచేత జనశూన్యమైపోయి, ఇలాంటి శిథిల స్థితికి వచ్చినై, అని ఆలోచించసాగాడు. ఖడ్గవర్మకు మాత్రం ఆ మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ పట్టుకుని ఎంత త్వరగా హతమార్చి అక్కడి నుంచి బయటికి పోదామా అని ఆత్రంగా వున్నది.

అంతలో వాళ్ళున్న చోటుకు దాపులవున్న ఒకరాతి గోడను,ఏదో బలమైన వస్తువు తాకినట్టు శబ్దం అయింది. ఆ శబ్దం వింటూనే ఖడ్గవర్మ చప్పున లేచి నిలబడి, ''జీవా! ఏమిటా శబ్దం? ఆ దుర్మార్గులిద్దరూ,మన మీద దొంగ దెబ్బ తీయాలని బయల్దేరి రావడం లేదు గదా?'' అన్నాడు.

ఇద్దరూ శిథిలావస్థలోవున్న రాతి గోడను సమీపించి, అవతలికి చూడబోయేంతలో, మాంత్రికుడు గోడ మీదికి వచ్చి, ''నరమానవుల్లారా! మీ ఇద్దర్నీ ఇప్పుడే మహాభూతానికి బలిచేస్తున్నాను,'' అంటూ కత్తిని జీవదత్తుడి కంఠం కేసి విసిరాడు.

చప్పున ఖడ్గవర్మ, మాంత్రికుడి కత్తిని పక్కకు నెట్టి, ''మాంత్రిక శుంఠా!ఆ బలి ఏదో చేయక, వాచాలత కొద్దీ ముందుగా మమ్మల్ని హెచ్చరించి ప్రాణం మీదికి తెచ్చుకున్నావు,'' అంటూ వాడి చేయి పట్టుకుని ముందుకు



గుంజాడు. మాంత్రికుడు దభీమంటూ గోడ మీదినుంచి కిందికి పడిపోయాడు.

ఈ లోపల, "బలి!బలి!బలి!" అంటూ జడలభూతం, ఆవేశోత్సాహంతో గోడమీదికి కొండ ముచ్చులా గెంతి నిలబడింది.

భూతం కిందికి చూసి, తన గురువు నేల కరిచి వుండడం గమనించి కీచుమని అరిచేంతలో, జీవదత్తుడు, దాని కాలుపట్టుకుని లాగి, అది కిందపడబోయే సమయంలో నడుం మీద గట్టిగా ఒక తన్ను తన్ని, "ఖడ్గా! ఇక మనం ఇక్కడ నిలబడడం క్షేమంకాదు. ఈ ప్రదేశమంతా మాంత్రిక వెధవల పుట్టలా వుంది. మనం ఆ కనబడే భవనాల్లో దేనిలోకైనా పోయి, వాళ్ళు మనను చుట్టుముట్టకుండా చూసుకుందాం," అన్నాడు.

ఆ వెంటనే ఇద్దరూ శిథిల భవనాల కేసి పరిగెత్తి, ఒక గది ద్వారం ముందు నిలబడి, శత్రువులు తమ మీదికి ఎటు నుంచి దాడి వస్తారో అని చూడసాగారు. కాని ఎక్కడా శత్రువుల ఆచూకీ లేదు. జడలభూతం, మాంత్రికుడూ మొండిగోడ పక్కన కూర్చుని బాధతో మూలిగే మూలుగులు తప్ప, ఆ ప్రదేశాన మరెలాంటి శబ్దమూ లేదు.

ఇద్దరూ నిశ్శబ్దంగా నడుస్తూ పోయి ఒక గదిలో ప్రవేశించారు. అక్కడ బాగా బలిసి వున్న పందికొక్కులు నాలుగైదు, "బౌక్! బౌక్!" అని అరుస్తూ గదిలో అటు ఇటూ పరిగెత్తసాగినై. గద్ద ప్రమాణంలోవున్న గుడ్లగూబ ఒకటిపైనుంచి కిందికి బాణంలా దూసుకువచ్చి, వాటిల్లో ఒకదాన్ని పట్టుకుని, అంత ఎత్తులోవున్న ఒక కిటికీ గుండా బైటికి ఎగిరిపోయింది.

వాళ్ళిద్దరూ అంతకు ముందు తాము వచ్చిన గది ద్వారం కేసి నడిచి, అందులో

అడుగు పెట్టేంతలో, హఠాత్తుగా వాళ్ళ తలల మీద రెండు కర్రదెబ్బలు పడినై. ఆ దెబ్బలకు ఇద్దరి కళ్ళూ బైర్లుకమ్మి కిక్కురు మనకుండా ముందుకుపడిపోయారు. వెంటనే నలుగురు పూజారిణి భృత్యులు వెనక నుంచి, వాళ్ళ తలలు పరీక్షించి చూశారు. ఎక్కడా నెత్తురు బయటికి చిమ్మిన జాడ కనబడలేదు.

"అదృష్టవంతులం! ఈ ఇద్దరు మానవ మాత్రుల తలలు పగిలినయ్యేమో అనుకున్నాను. వీళ్ళు చస్తే, మహాశక్తి పూజారిణి చేతుల్లో మనం చచ్చేవాళ్ళం," అన్నాడొక భృత్యుడు.

"చావకుండా దిమ్మ తిరిగి పడేందుకే గదా, దుడ్డుకర్రలకు మెత్తని గొంగళి పీలికలు చుట్టాం. ఇక, వీళ్ళ కాళ్ళూ, చేతులూ కట్టి భుజాన వేసుకోండి. పూజారిణి దగ్గరకు తీసుకుపోదాం," అన్నాడు మరొక భృత్యుడు.

వాళ్ళు, ఖడ్గజీవదత్తుల్ని భుజాన వేసుకుని, ఒక మంటపం మధ్య మెత్తని తివాసీలు పరిచిన ఉన్నతాసనం మీద కూర్చుని వున్న పూజారిణి దగ్గరకు తీసుకుపోయారు. తన భృత్యులు మోసుకువచ్చిన ఖడ్గజీవదత్తుల కేసి ఒకసారి ఓరకంటితో చూసి గతుక్కుమని, అంతలోనే కళ్ళింత చేసి, "అరెరె, మహాభూతా! వీళ్ళల్లో ఒకడు మంత్రవేత్తలా కనబడుతున్నాడే!" అన్నది.

"అయ్యేవుంటాడు, మహాశక్తి పూజారిణీ! వాడి చేతిలో మంత్రదండం కూడావున్నది. ఈ రెండవవాడి దగ్గర ఇంత పొడవాటి ఖడ్గం వున్నది," అన్నాడొకభృత్యుడు.

"అవేమయినై? ఎక్కడైనా పారేసి వచ్చారా?" అన్నది పూజారిణి.



"వీళ్ళను ప్రాణాలకు తెగించి పట్టిన చోటనే వదిలివచ్చాం!" అన్నాడొకభృత్యుడు.

"పోయి తీసుకురండి, వెధవల్లారా!" అంటూ పూజారిణి కళ్ళెర్ర చేసింది.

ఇద్దరు భృత్యులు పరిగెత్తుకుపోయి దండాన్నీ, కత్తినీ తెచ్చి ఆమె ముందుంచారు. పూజారిణి శ్రద్ధగా వాటిని కొంచెం సేపు పరీక్షించి, "వీటిల్లో ప్రత్యేక శక్తులేమీ వున్నట్టు కనిపించడంలేదు. వీళ్ళను చీకటి గదిలో బంధించి, వీటిని పక్కనే పడవేసి రండి. తరవాత ఏంజరుగుతుందోచూద్దాం," అన్నది.

భృత్యులు అలాగే చేశారు. ఒకపావు గంట తరవాత, ఖడ్గజీవదత్తులకు స్పృహవచ్చింది. ముందుగా స్పృహ తెలిసిన జీవదత్తుడు, ఖడ్గవర్మను తట్టిలేపాడు.

"మననిలా ప్రాణాలతో వదలడంలో పూజారిణి ఎత్తుగడ ఏమైవుంటుంది?" అని



అడిగాడు ఖడ్గవర్మ. అంతలో గది బయట నుంచి సింహం గర్జించిన ధ్వని వినబడింది. ఖడ్గవర్మ ఎగిరి నిలబడి, " ఈ చచ్చు వెధవలు మన మీదసింహాన్ని ప్రయోగించాలని చూస్తు న్నారా ఏం?" అంటూ నవ్వాడు.

" అదీ ఒకందుకు మంచిదే! మనం ఆ సింహాన్ని వాళ్ళ మీదనే ప్రయోగించి, ఈ శిథిల భవన ప్రాంతాలను బీభత్సం చేద్దాం," అంటూ జీవదత్తుడు దండంతో గది గోడను బలంగా ఒక పోటు పొడిచాడు. గోడలో కొంత భాగం పిడుగుదెబ్బ తిన్నట్టు పెద్ద శబ్దంతో విరిగి వెనక్కు పడిపోయింది. పక్క గదిలో వున్న సింహం బెదిరి చిన్నగా గర్జిస్తూ గోడ వారగా పోయి నిలబడింది.

"సింహరాజా! నీకు విముక్తీ, ఆహారం దొరకబోతున్నవి!" అంటూ జీవదత్తుడు, ఖడ్గవర్మతోపాటు గది బయటకు వచ్చాడు.

ఆ మరుక్షణం పదీ పన్నెండు మంది పూజారిణి భృత్యులు, "బందీలు పారిపో జూస్తున్నారు, పట్టుకోండి!" అని అరుస్తూ ముందుకు వచ్చారు. వెంటనే జీవదత్తుడు, సింహాన్ని సమీపించి, దాన్ని దండంతో పూజారిణి భృత్యుల కేసి, ఉసిగొల్పాడు. అది గర్జిస్తూపోయి వాళ్ళ మీద పడింది. కళ్ళు మూసి తెరిచేంతలో,వాళ్ళల్లో నలుగురైదు గురు దాని పంజాదెబ్బలకు బాగా గాయపడి నేలకొరిగారు. మరొకడు దాని నోటికి చిక్కి లబలబలాడుతున్నాడు. మిగిలిన అయిదా రుగురూ, పదీపన్నెండడుగుల శిథిలమైన గోడమీదికి ఎక్కి ప్రాణభయంతో వణికి పోసాగారు.

జీవదత్తుడు తన చేతిలోని దండాన్ని సింహం కేసి గురిచేసి, "సింహరాజా! ఈ పక్కనే భవనం కిందికి పోయే మెట్లున్నవి. ఆ దారిన పోయి ఈ శిథిలభవనాల్లోంచి బయట పడి, నది దాటి అరణ్యం చేరు!" అంటూ సింహం కేసి రెండడుగులు వేసి, దాన్ని మెట్లున్నవైపుకు మళ్ళించేందుకు దండాన్ని ముందుకు చాచి ఝుళిపించాడు.

సింహం చెవులు దిబ్బెళ్ళు పడేట్టు పెద్దగా గర్జించి, జీవదత్తుడి కేసి దూకబోయింది. అది ముందు కాళ్ళెత్తి, నిలబడి కుప్పించి దూక బోయే సమయంలో, జీవదత్తుడు దాని పొట్ట కింద దండాన్ని ఆనించి బలంగా పక్కకు తోశాడు.ఆ ఊపుకు సింహం నేలమీద పడి దొర్లుకుంటూ పోయి మెట్లున్న గది ద్వారానికి అడ్డంగా పడి లేచి, మెట్ల దగ్గర నిలబడింది.

మొండి గోడమీద కూర్చుని ఇదంతా చూస్తున్న పూజారిణి భృత్యులకు,జీవదత్తుడు

సింహాన్ని ఎదుర్కున్న తీరు ఆశ్చర్యాన్నీ, అబ్బురపాటునూ కలిగించింది. వాళ్ళల్లో ఒకడు రెండు చేతులూ ఎత్తి జీవదత్తుడికి నమస్కరిస్తూ, "మహామాంత్రిక శిరోమణీ, నమస్కారం! మీ మంత్రశక్తి మామూలు మనుషులకు అలవడేదికాదు. ఈ మహాశక్తి పూజారిణిని హతం చేసి, తమరే ఈ శిథిల నగరాన్ని ఎందుకు ఏలకూడదు? అప్పుడు మేమంతా మీ శిష్యులమై, చిరకాలం మీకు సేవలు చేస్తూ హాయిగా బతుకుతామే!" అన్నాడు.

ఆ వెంటనే అతడి తోటివాళ్ళు, "గురు ద్రోహం!" అని కేకలు పెడుతూ వాడి మీద కలియబడ్డారు.మొండిగోడ మీద కుస్తీ పట్లు ప్రారంభమయినై. ఆ రద్దీలో గోడ మీద కాలి పట్లు తప్పి ఇద్దరు భృత్యులు దభీమంటూ కిందపడ్డారు. మెట్లు దిగబోతున్న సింహం అదురుకుని తల తిప్పి చూసి,చిన్నగా గర్జిస్తూ వాళ్ళకేసి రాబోయింది.

జీవదత్తుడు దండాన్ని పైకెత్తి సింహాన్ని అదిలిస్తూ, "ఇకమెట్లుదిగి నీ దారిననువ్వుపో. పూజారిణి శిష్యుల కొట్లాటలో తలదూర్చి చిక్కుల పాలవ్వకు!" అన్నాడు.

సింహం చిన్నగా గుర్రుమంటూ తిరిగి తిరిగి చూస్తూ, మెట్లున్న గది ద్వారం దాటి పోయింది.

అప్పటివరకూజరుగుతున్నదంతామౌనంగా చూస్తూన్న ఖడ్గవర్మ, "జీవా! ఇక మనం మాత్రం ఇక్కడెందుకు? పూజారిణి శిష్యులు శిగపట్లు పట్టుకుని కిందా మీదా పడు తున్నారు. ఇప్పుడు మనను అడ్డగించే వాళ్ళె వరూలేరు. ఈ దిక్కుమాలిన శిథిల భవ



నాలను వదిలి,తిరిగి అరణ్యం చేరుదాం," అన్నాడు.

"అలాగే చేద్దాం! మనం కూడా సింహం వెళ్ళిన దారినే పోయి,మనం ఇక్కడికి వచ్చిన గుహద్వారాన్ని చేరగలమేమో ప్రయత్నించి చూద్దాం," అంటూ జీవదత్తుడు బయలు దేరాడు.

అయితే అతడూ,జీవదత్తుడూ బంధవి ముక్తులు కావడం,సింహం పెద్దగా గర్జిస్తూ పూజారిణిభృత్యుల్లో కొందరిని గాయపరచడం అంతా, బతికి బయటపడి పారిపోయిన ఒక భృత్యుడి ద్వారా పూజారిణికి తెలిసింది.

ఆ వార్త వింటూనే పూజారిణి చేతిలోని శూలాన్ని పైకెత్తి, "మహాభూతా! ఇదేమి చిత్రం. ముసలి పూజారి అంతవాణ్ణి, నా మంత్రబలంతో ఓడించి చీకటి కొట్లో బంధిం చానే! అటువంటి నా మీదికే ఇద్దరు మానవ




మాంత్రులు దండెత్తి రావడమా? నారాజ్యం లోనే జొరబడి, నా శిష్యుణ్ణి కొట్టి గాయపరచి, నా అంతదాన్నే అవమానించడమా? ఇది సహించను! ఒరే, శిష్యాధముల్లారా! తక్షణం పోయి, ఆ ఇద్దరు మానవపురుగుల్ని పట్టి తెండి,'' అన్నది.

ఖడ్గజీవదత్తులు సింహాన్నీ, మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ పెట్టిన బాధలు చూసిన శిష్యుల్లో ఇద్దరు, గడగడలాడిపోతూ, ''మహా శక్తి పూజారిణీ! ఆ మానవులిద్దరూ మహా సత్వుల్లాగా, గొప్ప మంత్రవేత్తల్లాగా కనబడు తున్నారు. వాళ్ళు మన ఆస్థాన మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ...''

భృత్యులు మాట ముగించే లోపలే, పూజా రిణి వాళ్ళల్లో ఒకణ్ణి శూలంతో వెన్ను మీద పొడిచి, ''నోరుముయ్యండి. పారుబోతు వెధవల్లారా! వాళ్ళిద్దర్నీ ఇప్పుడే పట్టి మహా భూతానికి బలిచేయబోతున్నాను. ముందుండి దారి తీయండి,'' అన్నది పళ్ళు కొరుకుతూ.

భృత్యులు ప్రాణం బితుకు బితుకు మంటూండగా ముందు బయలుదేరారు. వాళ్ళందరికన్నా కొంచెం ముందు మాంత్రి కుడూ, వాడి జడలభూతం నడవసాగారు.

ఈ లోపల, ఖడ్గజీవదత్తులు, శిథిల భవ నాల్లోని మరొక ప్రాంతం చేరి, తిరిగి అరణ్యం చేరేందుకు ఏదైనా మార్గం కనబడుతుందా అని చూడసాగారు. వాళ్ళు సొరంగ మార్గాన వచ్చిన దారి మాత్రం కనుక్కోలేకపోయారు.

''జీవా! మనం పూజారిణి మూకనుంచి చాలా దూరం వచ్చినట్టుంది. సింహం ఏమై నట్టు? అది అరణ్యం చేరినట్టేనా?'' అన్నాడు ఖడ్గవర్మ.

''అదీ మనలాగే ఇక్కడ చిక్కుపడి నట్టుంది. మధ్య మధ్య దాని గర్జనలు విన బడడం లేదా, నీకు?'' అంటూ జీవదత్తుడు, ఒక శిథిలభవనంలోని, ఒక గది లోపలికి అడుగు పెట్టి, ''అమ్మ, దుర్మార్గులు! దారే పోయే వర్తకుల్నీ, ప్రయాణికుల్నీ దోచి, ఎన్ని ధాన్యం బస్తాలు ఈ గదిలో దాచారో చూడు!'' అన్నాడు.

ఆ గదిలో ఎత్తుగా పేర్చిన ధాన్యం బస్తా లున్నవి. వాటిల్లో కొన్ని కుట్లు పగిలి వడ్లూ, గోధుమలూ, జొన్నలూ కిందికి జారి పోగు లుగా పడివున్నవి.

ఖడ్గవర్మ ఆశ్చర్యపోయి, ''జడలభూతాన్ని ముందు ప్రయోగించి జనాన్ని భయపెట్టి, మాంత్రికుడూ, ఇతర పూజారిణి భృత్యులూ, తమకవసరం అయిన తినుబండారాలు దోచు కుంటున్నారన్నమాట!'' అన్నాడు.

"ఈ ధాన్యంలో ఒక్క గింజ కూడా పూజారిణి గుంపు నోటికి అందకుండా చేస్తే,ఎలా వుంటుందంటావు? అప్పుడు కడుపుకాలి, బతుకు తెరువుకోసం వాళ్ళు, ఈ శిథిల భవనాలు వదిలి బయటికి రావచ్చు!" అన్నాడు జీవదత్తుడు.

"మనిద్దరికీ ఒకే ఆలోచన కలిగిందే!" అంటూ ఖడ్గవర్మ నవ్వి, దుస్తుల్లోనుంచి చెకుముకి రాయి తీసి కొట్టి దూది ముట్టుకునేలా చేశాడు. తర్వాత అది కాస్త మంట కాగానే, ధాన్యంబస్తాలలో ఒకదానికి అంటించాడు.

ఖడ్గజీవదత్తులు గది ముందు నిలబడి, క్రమంగా మంట పెద్దదై ధాన్యం బస్తాలు ఒకటొకటిగా అంటుకోవడం చూడసాగారు. నాలుగైదు నిమిషాల్లో గదిలో పెద్ద మంట లేచింది. ధాన్యం కాలి కొంత పేలాలుగా మారి గాలికి లేచి గడపవరకూ వచ్చిపడసాగినై.

ధాన్యం బస్తాలు కాలుతున్న గది పక్కనే వున్న మరొక గదిలో నుంచి, ఏదో మానవ కంఠం పెద్దగా ఆర్తనాదాలు చేయడం వినిపించింది.

"ఖడ్గా! ఈ పక్క గది తలుపులు మూసి వున్నవి! వినబడుతున్నదా, లోపలినుంచి ఎవరో కేకలు పెడుతున్నారు!" అంటూ జీవదత్తుడు గదిని సమీపించి, తలుపులను బలంగా నెట్టి చూశాడు.

ఖడ్గవర్మ అతడి దగ్గరకు పోయి నవ్వుతూ, "ప్రాణ రక్షణ చేయాలన్న ఆదుర్దాలో నువ్వు తలుపులకు బయట వేసివున్న తాళాన్ని కూడా చూడలేదు. నీ మంత్ర దండంతో ముందు తాళాన్ని పగలగొట్టు," అన్నాడు.

ఆ వెంటనే జీవదత్తుడు దండం ఎత్తి తాళం మీద బలంగా కొట్టాడు. తాళం విరిగి కింద పడింది. గొళ్ళాన్ని పక్కకు లాగి తలుపులను వెనక్కు నెట్టాడు ఖడ్గవర్మ.

గదిలో అంతగా చీకటిలేదు.గోడపైనఅంత ఎత్తులో వున్న ఒక చిన్న కిటికీ నుంచి లోపలికి వెలుగు వస్తున్నది. ఆ వెలుగులో వాళ్ళకు గోడలో కొట్టివున్న ఇనపమేకులకు, గొలుసులతో కట్టబడిన వృద్ధుడొకడు కనిపించాడు. అతడు ఆజానుబాహువు; బాగా బక్క చిక్కి వున్నాడు. పొడవాటి తెల్లగడ్డం గాలికి రెపరెపలాడుతున్నది. —(ఇంకావుంది)



ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు -
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

# 15. మాటతప్పని మహనీయుడు!



ఆదివారం సాయంకాలంకావడంతో దేవనాథుడు పిల్లలను వెంటబెట్టుకుని సమీపంలోనిఉద్యాన వనానికి వెళ్ళాడు. ఆయన చెప్పే కథ వినడానికి పెద్దమర్రిచెట్టు కిందపచ్చని గరికనేలపై అందరూ కూర్చున్నారు.

"ఇలాంటి అందమైన ప్రశాంత వాతావరణం లోనే పూర్వకాలంలో కథలు చెప్పుకునేవాళ్ళు. ప్రాచీన కాలానికి చెందిన గొప్పవారిని గురించి తెలుసుకోవడం ద్వారా గత కాలానికీ, వర్తమాన కాలానికీ మధ్య ఒక వారధిని నిర్మించుకుంటు న్నాము.అయితే ఇక్కడ ఒక విషయం గుర్తుంచు కోవాలి. చెప్పుకునే కథలు ప్రాచీనమైనవేతప్ప, అవి చాటేసత్యాలు, బోధించే విలువలు మాత్రం నిత్యనూతనమైనవి. మీకు త్రిశంకు గురించి తెలుసుకదా? ఇప్పుడు ఆయన కుమారుడు హరిశ్చంద్రుడి గురించి తెలుసుకుందాం.ఆయన జీవితంలో అడుగడుగునా పరీక్షలే. ఆయన జీవి తమే ఒక పెద్ద పరీక్షగా సాగింది. అన్ని పరీక్షల లోనూనెగ్గి మాటతప్పని మహనీయుడుగా జాతి చరిత్రలో నిలిచిపోయాడు. అందుకే ఆయన్ను సత్యహరిశ్చంద్రుడు అని అంటారు. ఈ కథ లోనూ విశ్వామిత్రుడికి కీలకపాత్ర ఉన్నది. త్రిశంకు విషయంలో ఎంతో కరుణతో నడుచు కున్న విశ్వామిత్రుడు, హరిశ్చంద్రుడి విష యంలో చాలాకర్కశంగా ప్రవర్తించాడు," అంటూ దేవనాథుడు ఇలా చెప్పసాగాడు:

"దేవసభకు వచ్చిన హరిశ్చంద్రుడి పురోహితు డైన వసిష్ఠుడి పట్ల ఇంద్రాది దేవతలు అమిత గౌరవాదరాలుకనబరచారు.భూలోకంలో అయో ధ్యను పాలించేరాజు హరిశ్చంద్రుడు అపూర్వ మైన రాజసూయయాగం చేశాడు. ఆడినమాట తప్పని మహనీయులే అలాంటి ప్రత్యేకమైన యాగం చేయగలరు. ఆయన చేత అలాంటి విశిష్టయాగం చేయించాడు గనకే, వసిష్ఠుడికి దేవలోకంలోఅంతటి గౌరవాదరాలులభించాయి. దానిని చూసిన విశ్వామిత్రుడికి ఈర్ష్యతో కోపం వచ్చింది. "హరిశ్చంద్రుడు ఆడి తప్పని గొప్ప వాడా? ఎలా ఆడి తప్పడో నేను చూస్తాను.



అతని చేత ఎలాగైనా అబద్ధం చెప్పించి వసిష్ఠుడి గౌరవాన్ని మంట గలుపుతాను,'' అంటూ పట్టరాని కోపావేశంతో భూలోకానికి వచ్చాడు.

విశ్వామిత్రుడు ఒక రాక్షసుణ్ణి తన మాయా శక్తితో అడవిపందిగా మార్చాడు. హరిశ్చంద్రుడి ఉద్యానవనాన్ని నాశపరచమని దానిని ఆజ్ఞాపించాడు. అది రాజోద్యానంలో జొరబడి నానా బీభత్సం సృష్టించింది. కాపలాభటులుగాని, సైనికులుగాని దానిని తరమడమో, చంపడమో, బంధించడమో చేయలేకపోయారు. రాజుతో మొరపెట్టుకున్నారు. రాజు విల్లంబులు అందుకుని గుర్రంమీద బయలుదేరి దానివెంట పడ్డాడు. అది ఒకచోట కనిపిస్తూ, మరొక చోట దాక్కుంటూ; ఉన్నట్టుండి రాజుపై ఉరుకుతూ, మరుక్షణమే వెనకవైపు కనిపిస్తూ అడవిలో చాలాదూరం వెళ్ళింది. రాజుకు ఇది ఎంతో ఆశ్చర్యం కలిగించింది. కాని దానిని వెంబడించి వెళ్ళాడు. ఆఖరికి అది కనిపించకుండా పోయింది.

రాజు అలిసిపోయి దాపులనున్న నదిలో దాహం తీర్చుకుని ఒక బండమీద విశ్రాంతి కోసం కూర్చున్నాడు. అప్పుడక్కడికి ఒకవృద్ధబ్రాహ్మణుడువచ్చి, రాజుకు నమస్కరించి ఎంతో కరుణతో మానవ ధర్మాల గురించి మాట్లాడాడు. నిర్జనారణ్యంలో ఇలాంటి ధర్మాత్ముడా అని ఎంతగానో ఆశ్చర్యపోయిన రాజు వృద్ధుడి పుట్టు పూర్వోత్తరాలనూ, క్షేమాన్నీ అడిగాడు.

ఆయనకు లేక లేక ఒక కొడుకు పుట్టాడనీ, అతడిప్పుడు యుక్తవయస్కుడైనప్పటికీ చాలినంతధనంలేక పెళ్ళి చేయలేకపోతున్నాననీ బ్రాహ్మణుడు మొరపెట్టుకున్నాడు.



రాజధానికి వస్తే కోరినంత ధనం ఇస్తానని రాజు బ్రాహ్మణుడికి మాటఇచ్చి రాజధానికి బయలుదేరాడు.

మరునాడే బ్రాహ్మణుడు రాజప్రాసాదానికి వచ్చి, రాజును సందర్శించి, ఇచ్చినమాట ప్రకారం తనకు రాజ్యాన్నీ, రాజభవనంతో సహా సకల సంపదలనూ దానంగా ఇవ్వమని కోరాడు. రాజు ఆగ్రహంతో తిరస్కరించగలడని బ్రాహ్మణుడు ఆశించాడుగాని, రాజు ఏమాత్రం చలించకుండా ప్రశాంత చిత్తంతో బ్రాహ్మణుడికి సర్వస్వాన్నీ ధారపోశాడు. హరిశ్చంద్రుడి నోటఎలాగైనా అబద్ధం పలికించాలన్న పంతంతో బ్రాహ్మణుడిరూపంలో వచ్చిన విశ్వామిత్రుడు, ''రాజా! అన్నమాట నిలుపుకున్నావు. పరమ సంతోషం. అయినా, దానం ఇచ్చిన తరవాత దాత దక్షిణ ఇచ్చుకోవాలన్న ధర్మం మరిచావా? ఏదీ నా దక్షిణ?'' అన్నాడు.



సర్వం బ్రాహ్మణుడికి సమర్పించి వట్టి చేతులతో నిలబడ్డ రాజుకు ఒక్క క్షణం ఏం చేయాలో తోచలేదు.కొంతసేపు మౌనం వహించి, "నీఇష్టానుసారమే కావలసిన దక్షిణ చెల్లిస్తాను. కొంత గడువు కావాలి," అని చెప్పి భార్య చంద్రమతినీ,కొడుకు లోహితాస్యుణ్ణీ వెంటబెట్టుకుని కట్టుబట్టలతో కాశీకి బయలుదేరాడు.

వాళ్ళు కాశీనగరాన్ని చేరీచేరక ముందే బ్రాహ్మణుడు వాళ్ళముందు ప్రత్యక్షమై, "ఏదీ నాకు చెందవలసిన దక్షిణ!" అంటూ వెంటబడ్డాడు. నానా మాటలతో హింసించ సాగాడు. సకాలంలో చెల్లించకపోతే శపిస్తానని బెదిరించాడు. ఒక్క మాట లేదని చెప్పు- వెళ్ళిపోతాను, అంటూ ఆశ చూపాడు;హెచ్చరించాడు. భర్త అనుభవిస్తూన్న వేదనను చూసి భరించలేక తనను ఎవరికైనా విక్రయించి ఆ సొమ్మును బ్రాహ్మణుడికి ఇవ్వమని చంద్రమతి భర్తకు సూచించింది.హరిశ్చంద్రుడికి మరొక మార్గం కనిపించక ఆమె చెప్పినట్టే చేశాడు.

భార్యాబిడ్డలను అమ్మగావచ్చినసొమ్ముతోనూ బ్రాహ్మణుడి బెడద తీరలేదు. హరిశ్చంద్రుడు, "సేవకావృత్తికి నేను సిద్ధం. నన్నెవరైనా కొనుక్కోండి!" అని గట్టిగాఅరుస్తూ వారణాసీపురవీధులలో తిరిగాడు. ఆఖరికి గంగాతీరంలోని శ్మశానవాటికకు కాపలాకాచే వీరబాహు , అయనకు కొంత సొమ్మిచ్చి కొనుక్కున్నాడు. ఆ సొమ్ముతో బ్రాహ్మణుడడిగిన దక్షిణ తీరిపోయింది.

శ్మశానానికి వచ్చిన శవాలకు సుంకం వసూలు చేస్తూ, శవదహనాలు చేయిస్తూ, వసూలయిన మొత్తాన్ని యజమానికి అప్పగిస్తూ హరిశ్చంద్రుడు కాటికాపరిగా కాలంగడపసాగాడు.

చంద్రమతిని సేవకురాలిగా కొనుక్కుని వెళ్ళిన కాలకౌశికుడనే బ్రాహ్మడు, ఆమెకు చేయలేని ఇంటిపనులన్నిటినీ పురమాయిస్తూ రకరకాలుగా హింసించసాగాడు. చంద్రమతి ఇన్ని బాధలు అనుభవిస్తున్నప్పటికీ, తన భర్త మాట నిలుపుకోవడానికి సాయపడ్డాను కదా అన్న తృప్తితో ఓర్పుగా కాలంగడపసాగింది.

ఒకనాడు లోహితాస్యుడు దర్భలు సేకరించడానికి వెళ్ళి, పాముకాటుకు గురై మరణించాడు. వెంటనే వెళ్ళి బిడ్డను చూడడానికి కూడా కాలకౌశికుడు చంద్రమతిని అనుమతించలేదు. ఇంటి పనులన్నీ పూర్తి చేసి పొద్దు గూకాక ఆమె బిడ్డ దగ్గరికి వెళ్ళింది.

శరీరమంతా విషపూరితమైపోయి,ప్రాణం లేకుండా పడివున్న బిడ్డను చూసి హృదయ విదారకంగా విలపించింది. బిడ్డను భుజాలపై కెత్తుకుని శ్మశానంకేసి నడిచింది.చుట్టూ గాడాంధకారం. అప్పుడప్పుడు భీతి కొలిపే మెరుపులు. ఆఖరికి ఆమె శ్మశానం చేరాక బిడ్డ దహన సంస్కారానికి సుంకం చెల్లించమని కాటికాపరి పట్టు

పట్టాడు. తన దగ్గర చిల్లిగవ్వ లేదని ఆమె ఎంత బతిమాలినా అతడు ఒప్పుకోలేదు. ఆ కాటి కాపరి మరెవ్వరోకాదు.ఆమెభర్త హరిశ్చంద్రుడు! అది గ్రహించాక ఆమె దిగ్భ్రాంతితో మూర్ఛ పోయింది. తెప్పరిల్లాక ఒకరినొకరు గుర్తిం చారు. తమ బిడ్డతో పాటు ప్రాణత్యాగం చేయా లని భార్యాభర్తలు నిర్ణయించుకున్నారు. చితి పేర్చి, బిడ్డ భౌతిక కాయాన్ని చితిపై పెట్టి, నిప్పు రగిలించి, భార్యాభర్తలు చితిమంటలలోకి ఉరకబోయే సమయంలో పిడుగుపాటులాంటి శబ్దంతో కళ్ళుమిరమిట్లు గొలిపే వెలుగు వెలి గింది.

మరుక్షణమే వాళ్ళ ఎదుట లోహితాస్యుడు సజీవుడై లేచి నిలబడి నవ్వుతూ కనిపించాడు. అతనిపై పూలవాన కురిసింది.

ఇంద్రాది దేవతలతో విశ్వామిత్రుడు అక్క డికి వచ్చి, ''హరిశ్చంద్రా! నువ్వు నిజంగానే సత్యవంతుడవు. నీ సత్యవ్రతాన్ని పరీక్షించ డానికే దేవతలతో కలిసి ఈ నాటకం ఆడాను. నిన్ను కాటికాపరిగా నియమించడానికి యమ ధర్మరాజే వీరబాహుగా శ్మశాన వాటికకు వచ్చాడు. వసిష్ఠుడు నిన్ను పొగడడంలో తప్పేమీలేదు. నీ సంకల్పం అనన్య సామాన్యం! నీ చరితం ముల్లోకాలకూ ఆదర్శప్రాయం! నీ రాజ్యాన్ని నువ్వే ఏలుకో!'' అంటూ వాళ్ళను అయోధ్యకు చేర్చాడు.

దేవతలందరూ హరిశ్చంద్రుడి సత్యదీక్షను కీర్తించారు.

''ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలంటే మనిషి ఎన్నెన్ని కష్టనష్టాలనూ, కడగండ్లనూ ఎదుర్కో వలసి వస్తుందో హరిశ్చంద్రుడి కథ మనకు తెలియజేస్తుంది. అంతేకాదు; అలాంటి శక్తి సామర్థ్యాలు మనిషికి ఉన్నాయి అనికూడా ఇది నిరూపిస్తోంది. హరిశ్చంద్రుడి కథను తర తరా లుగా చెప్పుకుంటూ ఉన్నారు. ఎందరి హృద యాలనో కదిలించి, కంటతడి పెట్టించిందీ కథ. మరెందరి జీవితాలనో బాగుపరిచిందీ మహో జ్వల వృత్తాంతం! కాలే కొద్దీ బంగారం మరింత కాంతితో జ్వలించే విధంగా జీవితంలో ఎదు రయ్యే కష్టనష్టాలు, బాధలు మనిషిని నిగ్గ తేలుస్తాయని ఈ కథ సూచిస్తుంది!'' అన్నాడు దేవనాథుడు. —(ఇంకావుంది)



# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

సుప్రసిద్ధ గాయని ఎం.ఎస్.సుబ్బలక్ష్మి మృదు మధురంగా ఆలపించిన 'భావయామి రఘు రామం' అనే కీర్తన ఈనాటికీ శాస్త్రీయ సంగీతాభి మానులను ఎంతగానో అలరిస్తున్నది. గంభీర భావంతో నిండిన ఆ మధుర గీతాన్ని రచించిన వారెవరో తెలుసా? సుప్రసిద్ధ వాగ్గేయకారుడు మహారాజా స్వాతి తిరునాళ్.

కేరళలోని తిరువాన్కూరు సంస్థానం రాజ కుటుంబానికి చెందిన స్వాతి తిరునాళ్ 1813 ఏప్రిల్16వ తేదీ తిరువనంతపురంలో జన్మించాడు. తిరువాన్కూరు మహారాజాకు మగ సంతానం లేకపోవడంతో ఆయనకు వారసులు లేరనే విచారం పట్టుకున్నది. ఆయన సోదరి గర్భిణిగా ఉన్న ప్పుడు, ఆమెకు పుట్టబోయే బిడ్డే తన వారసుడని మహారాజా ప్రకటించాడు. ఆ బిడ్డే స్వాతి తిరునాళ్. గర్భంలో ఉన్నప్పుడే రాజుగా ప్రకటించడంవల్ల ఆయన్ను 'గర్భ శ్రీమాన్' అని కూడా పిలిచేవారు. ఆయనకు రామవర్మ అని పేరు పెట్టారు. వంశ పారంపర్యంగా వచ్చే 'కులశేఖర' బిరుదం కూడా ఆయనకు ఉన్నది. అయితే, ఆయన జన్మించింది స్వాతి నక్షత్రంలో కాబట్టి 'స్వాతి తిరునాళ్' నామం తోనే ప్రసిద్ధుడయ్యాడు.

ఆయన 17 యేట 1829 ఏప్రిల్ 21వ తేదీ మహారాజాగా పట్టాభిషిక్తుడయ్యాడు. వివేకి గానూ, సమర్థవంతుడైన పరిపాలనాదక్షుడుగానూ ఆయన పేరుగాంచాడు. భారతదేశంలోనే మొట్ట మొదటి 'అబ్సర్వేటరీ'ని, ప్రజాగ్రంథాలయాన్ని నిర్మింపజేశాడు. మునసబు కోర్టులు ఏర్పాటు చేశాడు. రెవిన్యూ సర్వేలను, జనాభాలెక్కల సేక రణను ప్రవేశపెట్టాడు. అల్లోపతీ ఔషధాలనూ, పాఠశాలలలో ఇంగ్లీషు విద్యాబోధననూ ప్రోత్స హించాడు.సంగీత సాహిత్యాలు, కళలు, తత్వశాస్త్రం అంటే ఆయనకు ఎంతో మక్కువ. గొప్ప కళాపోష కుడుగా పేరుగాంచాడు.



మహారాజా స్వాతి తిరునాళ్

ఆయనలోని కళాభిమానం, ఆయనకు కొన్ని కష్టాలు కూడా తెచ్చిపెట్టింది. సంస్థానంలో 'బ్రిటిష్ రెసిడెంట్'గా వున్న జనరల్ కుల్లెన్ కళాపోషణకు స్వాతి తిరునాళ్ చేస్తున్న ఖర్చును నిరాకరించాడు. సంస్థాన పరిపాలనా వ్యవహారాలలో రోజురోజుకూ అతడి జోక్యం ఎక్కువయింది. స్వాతి తిరునాళ్ సాధ్యమైనంతవరకు అతన్ని దూరంగా ఉంచాడు. పరిస్థితి చేయిదాటి పోగానే పాలనా వ్యవహారాల నుంచి పక్కకు తప్పుకుని తన సమయాన్నంతా సంగీత సాహిత్యాలకూ, మత సంబంధమైన విష యాలకూ వినియోగించాడు.

1846 డిసెంబర్ 25వ తేదీ ఆయన కీర్తి శేషుడయ్యాడు.

సంస్కృతం, మలయాళం, హిందూస్థానీ, తెలుగు, కన్నడ భాషలలో దాదాపు నాలుగు వందల భక్తి కీర్తనలను ఆయన రచించాడు.

రాజకుటుంబానికి చెందిన ఈ వాగ్గేయ కారుడు జీవించింది స్వల్పకాలమే అయినా, భారతీయ సంగీతానికి ఆయన చేసిన సేవ అనల్పం; అనుపమానం. ఆయన రచించిన సుమధుర గీతాలు తరతరాల సంగీతాభిమానులను అల రిస్తూనే ఉంటాయి!

ఇదొక చందమామ కానుక!

# 20-వ శతాబ్దంలో భారత దేశం

## అభ్యుదయ పథంలో అతిపెద్ద ప్రజాస్వామ్యం 1977 - 2000

1975లో విధించబడిన అత్యవసర పరిస్థితి 1977 ఫిబ్రవరి - మార్చినెలలలో జరిగిన ఎన్నికలలో తీవ్ర ప్రభావాన్ని చూపింది. 30 సంవత్సరాలపాటు నిరంతరాయంగా సాగిన కాంగ్రెస్ పాలన అంతమయింది. కాంగ్రెసేతర ప్రభుత్వం అధికారం చేపట్టింది. కాంగ్రెస్ (ఒ), భారతీయ లోక్‌దళ్, జనసంఘ్, సోషలిస్టు పార్టీలు జనతాపార్టీపేరుతో ఒకటయ్యాయి. మొరార్జీ దేశాయ్ ఆ పార్టీ అధ్యక్షుడయ్యాడు. మాజీ మంత్రి జగజ్జీవన్‌రామ్ కాంగ్రెస్ పార్టీకి రాజీనామా చేసి డెమొక్రటిక్ కాంగ్రెస్ అనే కొత్త పార్టీ స్థాపించాడు. జనతాపార్టీతో ఒక అవగాహనకు వచ్చాడు. ఫిబ్రవరి 16- మార్చి 10వ తేదీ మధ్య జరిగిన ఎన్నికలలో జనతాపార్టీ దాని మిత్రపక్షాలు మెజారిటీ సాధించాయి. ఇందిరాగాంధీ రాయ్‌బెరేలో ఓడిపోయింది. మార్చి 21వ తేదీ అత్యవసర పరిస్థితి ఉపసంహరించుకోబడింది.మార్చి 24వ తేదీ మొరార్జీ దేశాయ్ ప్రధానమంత్రి పదవీ బాధ్యతలు స్వీకరించాడు.



మొరార్జీ దేశాయ్

కాంగ్రెస్ వ్యతిరేక పవనాలు పది రాష్ట్రాలలోనూ, రెండు కేంద్రపాలిత ప్రాంతాలలోనూ స్పష్టంగా కనిపించాయి.

జూన్ 21వ తేదీ నీలం సంజీవరెడ్డి ఆరవ భారత రాష్ట్రపతి అయ్యాడు.

పలువురు యువ కాంగ్రెస్ సభ్యులు పార్టీనుంచి వైదొలగడంతో, ఇందిరాగాంధీ కాంగ్రెస్ కార్యవర్గ కమిటీకి రాజీనామా చేయవలసి వచ్చింది. 1978లో త్రిపుర, అరుణాచల ప్రదేశ్, మేఘాలయ, మహారాష్ట్ర రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఏర్పడ్డాయి.



నీలం సంజీవరెడ్డి

# ప్రథమ సంకీర్ణ మంత్రిమండలి

1979 జూలై 11వతేదీ మొరార్జీ దేశాయ్ మంత్రి వర్గానికి వ్యతిరేకంగా ప్రతిపక్షాలు అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశ పెట్టాయి. ఆయన జూలై 15వ తేదీ రాజీనామా చేశాడు. ఉప ప్రధాని చరణ్‌సింగ్ జనతా పార్టీని వదిలి, జనతా (సెక్యులర్) వర్గానికి నాయకుడయ్యాడు. జూలై 28వ తేదీ భారతదేశంలో ప్రథమ సంకీర్ణ మంత్రి మండలిని ఆయన ఏర్పాటు చేశాడు. అయితే, అది అట్టే కాలం నిలబడలేదు. ఆగస్టు 20వ తేదీ చరణ్‌సింగ్ రాజీనామా చేశాడు. ఆ తరవాత రాష్ట్రపతి లోక్‌సభను రద్దు చేశాడు.


చరణ్‌సింగ్

1980 జనవరి 2-6 మధ్య జరిగిన లోక్‌సభ ఎన్నికలలో అధిక మెజారిటీతో ఇందిరాగాంధీ మళ్ళీ అధికారం చేపట్టారు. మొత్తం 524 స్థానాలలో కాంగ్రెస్ (ఐ) 353 స్థానాలను గెలుచుకున్నది. జనవరి 14వ తేదీ ఇందిరాగాంధీ మళ్ళీ ప్రధాన మంత్రి అయ్యారు. కర్నాటక, గోవా, అరుణాచల ప్రదేశ్, హిమాచల ప్రదేశ్ రాష్ట్రాలలో మళ్ళీ కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది. పాండిచ్చేరి, మణిపూర్, హర్యానా, నాగాల్యాండ్‌లలో అధికారం కోసం ఇతర పార్టీలతో చేతులు కలిపింది. మే నెలలో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ గుజరాత్, రాజస్థాన్, మధ్య ప్రదేశ్, ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్‌లలో మూడింటరెండువంతుల మెజారిటీనీ, మహారాష్ట్ర, పంజాబు రాష్ట్రాలలో సింపుల్ మెజారిటీనీ సాధించింది.


ఇందిరాగాంధీ

అదే సమయంలో ఏప్రిల్ 6వ తేదీ భారతీయ జనతాపార్టీ ఏర్పడింది. అటల్ బిహారీ వాజ్‌పేయి ఆ పార్టీ అధ్యక్షుడయ్యాడు.

1982 జనవరి 9వ తేదీ ఎస్.జెడ్. ఖాసిం నాయకత్వంలో 21 మంది శాస్త్రవేత్తల బృందం అంటార్కిటికా ఖండాన్ని చేరుకున్నది. దాదాపు ఒక నెలపాటు పరిశోధనలు జరిపి 'దక్షిణ గంగోత్రి' అనే పరిశోధనా కేంద్రాన్ని నెలకొల్పింది.


జైల్‌సింగ్

1982 జూలై 25వ తేదీ సర్దార్ జైల్ సింగ్ ఏడవ భారత రాష్ట్రపతి అయ్యాడు.

1977ఎన్నికల ద్వారా మళ్ళీ ఒకసారి జమ్ము కాశ్మీరు ముఖ్యమంత్రి అయిన షేక్ అబ్దుల్లా మరణించడంతో, ఆయన కుమారుడు ఫరూక్ అబ్దుల్లా 1982లో ఆ పదవికి ఎంపికయ్యాడు.



ఫరూక్ అబ్దుల్లా

1983 ఏప్రిల్ 3వ తేదీ అకాలీదళ్ 'రాస్తారోకో' పిలుపు నివ్వడంతో పంజాబులో అలజడులు ఆరంభమయ్యాయి. తమ పోరాటాన్ని ఉధృతం చేయడానికి 100,000మందితో 'సైన్యం' ఏర్పాటు చేయగలమని దళ్ ప్రకటించింది. జర్నయిల్ సింగ్ భింద్రన్ వాలా అనే తీవ్ర వాది రెండు మతాల వారికి వ్యతిరేకంగా హింసను రెచ్చగొట్టాడు. అమృత్ సర్‌లోని 'స్వర్ణ దేవాలయం'లో స్థావరం ఏర్పరచుకున్నాడు. కేంద్ర ప్రభుత్వం చర్చలకు పిలిచింది.కాని అకాలీదళ్ అధ్యక్షుడు హర్‌చంద్ సింగ్ లోంగోవాల్ తిరస్కరించాడు.



◆ 1977 లో మెహిర్ మూస్ అంటార్కిటికాను చేరుకున్న తొలిభారతీయ మహిళగా పేరు తెచ్చుకున్నది.

# బయటి ప్రపంచంలో ....

❖ బ్రిటన్‌లో మళ్ళీ కన్సర్వేటివ్ పార్టీ అధికారానికి వచ్చింది. 1979 మే 4వ తేదీ జరిగిన ఎన్నికలలో మార్గరెట్ థాచర్ నాయకత్వం వహించిన టోరీలు, లేబర్ పార్టీ కన్నా 43 స్థానాలు ఆధిక్యత సాధించారు. ఆమె యూరపులో ప్రథమ మహిళా ప్రధాని అయ్యారు.



మార్గరెట్ థాచర్

❖ ఆఫ్ఘనిస్తాన్‌లో సోవియట్ సేనలు ఉండడానికి వ్యతిరేకతను తెలియజేస్తూ,అమెరికాప్రోద్బలంతో దాదాపు 60 దేశాలు, 1980 మాస్కో ఒలింపిక్స్‌ను బహిష్కరించాయి. జూలై 29వ తేదీ ఇండియా హాకీలో ఒలింపిక్ బంగారు పతకాన్ని మళ్ళీ పొందింది.

● '2000నాటికి అందరికీఆరోగ్యం' అని 1977లో ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రకటించింది.

# అతి పిన్నవయసు ప్రధాని

1983లో కొత్త రాజకీయ కూటములు ఏర్పడ్డాయి. అక్టోబర్ 8వ తేదీ లోక్‌దళ్, భారతీయ జనతాపార్టీలు పొత్తు కుదుర్చుకుని జాతీయ ప్రజాస్వామ్య కూటమిని ఏర్పాటు చేశాయి. అటల్ బిహారీవాజ్‌పేయి దాని అధ్యక్షుడయ్యాడు.

సెప్టెంబర్‌లో జనతాపార్టీ, కాంగ్రెస్ (ఎస్), డెమొక్రటిక్ సోషలిస్టుపార్టీ, రాష్ట్రీయ కాంగ్రెస్ పార్టీలు కలిసి యునైటెడ్ ఫ్రంట్‌ను ఏర్పాటు చేశాయి. జనతాపార్టీ నాయకుడు చంద్రశేఖర్, యునైటెడ్ ఫ్రంట్ అధ్యక్షుడయ్యాడు.


రాజీవ్ గాంధీ

1984 ఆరంభంలో పంజాబు రాజకీయాలు వేడెక్కాయి. స్వర్ణదేవాలయాన్ని ఆక్రమించుకుని కూర్చున్న తీవ్రవాది భింద్రన్ వాలా, అతని సహచరులు లొంగిపోవాలని కేంద్రం హెచ్చరించింది. కాని తీవ్రవాదులు దానిని పట్టించుకోలేదు. ఆలిండియా శిక్కు విద్యార్థుల యూనియన్ నిషేధించబడింది. మేలో స్వర్ణదేవాలయాన్ని చుట్టుముట్టిన సాయుధ దళాలను ఉపసంహరించుకోవాలని అకాలీలు కోరారు. దాంతో పాటు స్వయం ప్రతిపత్తి గల ఖలిస్తాన్‌ను కూడా ఏర్పాటు చేయాలని వాళ్ళు కోరారు. ప్రభుత్వం 'ఆపరేషన్ బ్లూస్టార్' అనే సైనికచర్యకు పూనుకున్నది. కాల్పులు, ఎదురు కాల్పులు సాగాయి. భింద్రన్ వాలా, స్టూడెంట్స్ ఫెడరేషన్ నాయకుడు అమ్రిక్ సింగ్ ప్రాణాలు కోల్పోయారు.

శిక్కు తీవ్రవాదులపై తీసుకున్న ఈ చర్య, దేశంలో దారుణ పర్యవసానాలకు దారితీసింది. అక్టోబర్ 31వ తేదీ ప్రధానమంత్రి ఇందిరాగాంధీ, ఆమె ఇంటి దగ్గరే కాపలావున్న శిక్కు సెక్యూరిటీ గార్డ్ తుపాకీ గుళ్ళకు బలి అయ్యారు. ఆమె కుమారుడు రాజీవ్‌గాంధీ అప్పటికే కాంగ్రెస్ పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఉన్నాడు. ఆయన కలకత్తా పర్యటన నుంచి తిరిగి వచ్చి ప్రధానమంత్రిగా పదవీ ప్రమాణస్వీకారం చేశాడు.

ఆ తరవాత రెండు రోజులలో ఢిల్లీలోనూ, ఉత్తర భారతంలోని మరికొన్ని ప్రాంతాలలోనూ శిక్కులకు వ్యతిరేకంగా హింసాకాండ చెలరేగింది.

డిసెంబర్‌లో పంజాబు, అస్సాం రాష్ట్రాలు మినహా దేశమంతటా లోక్ సభ ఎన్నికలు జరిగాయి. మొత్తం 504 స్థానాలలో 401 స్థానాలు కాంగ్రెస్‌కు లభించాయి. ఇది లోక్ సభ ఎన్నికలలో ఒక రికార్డుగా నిలిచింది. డిసెంబర్ 31వ తేదీ రాజీవ్ గాంధీ, ప్రధానమంత్రిగా ఎన్నుకోబడ్డాడు. అప్పుడాయన వయసు 40 సంవత్సరాలే!


రాకేష్‌శర్మ

భారత వైమానిక దళానికి చెందిన స్క్వాడ్రన్ లీడర్ రాకేష్‌శర్మ సోవియట్ అంతరిక్షగాములతో కలిసి 1984 ఏప్రిల్ 4వ తేదీ సోయుజ్ టి-11లో అంతరిక్షంలోకి వెళ్ళి ఒక వారం పాటు అక్కడ ప్రయోగాలు చేసి భూమికి తిరిగివచ్చాడు. ఆ విధంగా రాకేష్‌శర్మ అంతరిక్షయానం చేసిన తొలి భారతీయుడు అనే పేరు తెచ్చుకున్నాడు. ప్రపంచం మొత్తం మీద అంతరిక్షానికి వెళ్ళి వచ్చిన వారిలో రాకేష్‌శర్మ 138వ వాడు.

- 1979 జూన్ 7వ తేదీ భారతదేశంతానే స్వయంగా తయారు చేసిన కృత్రిమ ఉపగ్రహం భాస్కర-1 ని సోవియట్ ఉపగ్రహకేంద్రం నుంచి అంతరిక్షంలోకి ప్రయోగించింది.


ప్రకాశ్ పడుకోన్

- మన దేశానికి చెందిన ప్రకాశ్ పడుకోన్ 1979లో లండన్‌లో వరల్డ్ బాడ్మింటన్ ఛాంపియన్ అయ్యాడు.
- 1982 మార్చ్ 2వ తేదీ పాట్నాలో గంగా నది మీద నిర్మించిన మహాత్మాగాంధీ వంతెనను ఆవిష్కరించారు. 5.575 కి.మీ. పొడవైన ఈ వంతెన ప్రపంచంలోనే అతి పెద్దది.

# బయటి ప్రపంచంలో ....

- 1981 వ సం॥లో అమెరికా స్పేస్ షటిల్ కొలంబియాను అంతరిక్షంలోకి ప్రయోగించింది. అది ఒక రాకెట్ మీద పైకివెళ్ళి విమానం లాగా ఎగిరి, గ్లైడర్‌లా కిందికి దిగి వచ్చింది. అంతరిక్ష యాత్రలో దీనిని ఒకమైలు రాయిగా పేర్కొంటారు.

- 983 మార్చ్ 23వ తేదీ అమెరికా ప్రెసిడెంట్ రొనాల్డ్ రీగన్ 'స్టార్ వార్స్'


రొనాల్డ్ రీగన్

కార్యక్రమం ప్రారంభమవుతుందని ప్రకటించాడు. అణుబాంబుల దాడి నుంచి తమ దేశాన్ని కాపాడు కోవడానికి రక్షణాకవచం నిర్మించడమే దీని ఉద్దేశమని ఆయన చెప్పాడు. కాని అణుబాంబులు నిలువచేయడమే ఆయన అసలు ఉద్దేశం!

# పంజాబులో సర్దుబాటు

1984 డిసెంబర్ 3వ తేదీ భోపాల్‌లో జరిగిన దుర్ఘటన మానవ చరిత్రలో మాయని మచ్చగా మిగిలిపోయింది. క్రిమి సంహారక మందులు తయారుచేసే ఒక ఫ్యాక్టరీ నుంచి అర్ధరాత్రి దాటాక గ్యాస్‌లీక్ కావడం ఆరంభమయింది. ఆ కారణంగా మధ్యప్రదేశ్ రాష్ట్ర రాజధాని భోపాల్ కొంతసేపటికి 'గ్యాస్ ఛాంబర్'గా మారిపోయింది. 3,000 మందికి పైగా ప్రజలు చనిపోయారు. వేలాది మంది ఇళ్ళు వదిలారు. ఆస్పత్రులకు వెళ్ళినా వేలాది మంది జీవితాంతం వికలాంగులుగానే మిగిలి పోయారు!

'ఆపరేషన్ బ్లూ స్టార్' సైనిక చర్య శిక్కులకు ఆగ్రహావేదనలు కలిగించింది. వాళ్ళను ఓదార్చడానికి కేంద్రం ప్రయత్నించింది. 1985 జూలై 24వ తేదీ ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ, సంత్ లాంగోవాల్‌ల మధ్య చారిత్రాత్మకమైన పంజాబు శాంతి ఒప్పందం కుదిరింది. శిక్కులకూ, కేంద్రప్రభుత్వానికీ మధ్య శాంతి కుదర్చడానికి లాంగోవాల్ ప్రయత్నించాడు. కాని ఆయన మీదే శిక్కు తీవ్రవాదులకు అసంతృప్తి, ఆగ్రహం కలిగాయి. పంజాబు శాంతి ఒప్పందాన్ని వ్యతిరేకించారు. లాంగోవాల్ ఆగస్టు 20వ తేదీ ఒక సమావేశంలో ఉపన్యసిస్తూండగా ఖలిస్తాన్ ఉగ్రవాదిఆయన్ను కాల్చి చంపాడు. సెప్టెంబర్‌లో ఎన్నికలు జరిగాయి. యునైటెడ్ అకాలీదళ్ ఎన్నికలను బహిష్కరించాలని పిలుపు నిచ్చింది. అయితే అందులో నుంచి చీలి పోయిన మరొక వర్గం ఎన్నికలలో పాల్గొనాలన్నది. అకాలీదళ్‌కు 73 స్థానాలూ, కాంగ్రెస్‌కు 32 స్థానాలూ వచ్చాయి. సుర్జీత్ సింగ్ బర్నాలా పంజాబు ముఖ్యమంత్రి అయ్యాడు.

పార్లమెంటు సభ్యులూ, శాసనసభ్యులూ తరచూ, పార్టీలు మారడాన్ని అరికట్టడానికి వీలుగా పార్టీ ఫిరాయింపు నిషేధ చట్టం 1985లో చేయబడింది. భారత ప్రజాస్వామ్య చరిత్రలో చారిత్రాత్మకమైన ఈ చట్టం 1985 జనవరి 30వ తేదీ అమలులోకి వచ్చింది.


ఆర్.వెంకటరామన్

1986 జూలై 25వతేదీ మన దేశానికి ఎనిమిదవ రాష్ట్రపతిగా ఆర్. వెంకటరామన్ పదవీ బాధ్యతలు స్వీకరించాడు.

అంతవరకు కేంద్రపాలిత ప్రాంతాలుగా కొనసాగిన అరుణాచల ప్రదేశ్, మిజోరం 1987 ఫిబ్రవరి 20వ తేదీ రాష్ట్రాలుగా అవతరించాయి. మే 30వ తేదీ భారత యూనియన్‌లో గోవా 25వ రాష్ట్రమయింది. ఒకప్పుడు పోర్చుగీసుల ఏలుబడిలోవున్న డామన్, డయ్యూలు ఒకటై కేంద్రపాలన కిందికి వచ్చాయి.

శ్రీలంకలో జాతి వైషమ్యాల కారణంగా చెలరేగిన ఘర్షణల దృష్ట్యా ప్రధాని రాజీవ్




గాంధీ కొలంబోకు వెళ్ళాడు. 1987 జూలై 29వ తేదీ శ్రీలంక ప్రెసిడెంట్ జయవర్ధనేతో ఒక ఒప్పందంలో సంతకం చేశాడు. భారత్ శ్రీలంకకు శాంతి పరిరక్షణ సేనను పంపుతుందనీ, ఇండియా పర్యవేక్షణలో తమిళులు అధిక సంఖ్యాకులుగా ఉన్న ఈశాన్య ప్రాదేశిక కౌన్సిల్‌కు ఎన్నికలు జరుగుతాయనీ నిర్ణయించబడింది. తమిళ యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్ నుంచి వి.ప్రభాకరన్ నాయకత్వంలో లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిళ్ ఈలం (ఎల్.టి.టి.ఇ) విడిపోయింది. శ్రీలంక సైన్యంతో తమిళ పులులు గెరిల్లా యుద్ధానికి దిగారు. భారత శాంతిసేన శ్రీలంకలో రెండేళ్ళు ఉన్నది.

♦ 1950లో కలకత్తాలో 'మిషనరీస్ ఆఫ్ ఛారిటీ' స్థాపించిన మదర్ థెరీసాకు 1979 అక్టోబర్ 17వ తేదీ నోబెల్ శాంతి బహుమతి లభించింది. 1980 జనవరిలో భారత ప్రభుత్వం ఆమెను అత్యున్నతమైన 'భారత రత్న' బిరుదంతో సత్కరించింది.



మదర్ థెరీసా

# బయటి ప్రపంచంలో ....

❖ 1985లో ప్రెసిడెంట్ మిఖైల్ గార్బచేవ్ సోవియట్ పరిపాలనా విధానాన్ని సంస్కరిస్తున్నానని చెప్పి రెండు చర్యలు తీసుకున్నాడు. ఒకటి గ్లాస్‌నోస్త్ (బహిరంగ సంప్రదింపులు) రెండవది పెరిస్త్రోయికా (పునర్నిర్మాణం). ఈ రెండూ అధికార వికేంద్రీకరణకూ, ఫ్రీ



మిఖైల్‌గార్బచేవ్

మార్కెట్టుకూ దోహదం చేశాయి. అమెరికా ప్రెసిడెంట్ రొనాల్డ్ రీగన్‌తో ఆయుధ పోటీని అదుపుచేయాలని ఆయన చర్చలు కూడా జరిపాడు.

● 1978వ సం॥ పశ్చిమ జర్మనీలో కాంపాక్ట్ డిస్కులు (సీడీలు) పరిచయమయ్యాయి.



# అస్థిర ప్రభుత్వాలు

1989 నవంబర్‌లో జరిగిన 9వ లోక్‌సభ ఎన్నికలలో ఏ ఒక్క పార్టీ మెజారిటీ సాధించ లేకపోయింది. కాంగ్రెస్ (ఐ) కి 193 స్థానాలే లభించాయి. జనతాదళ్‌కు 141 స్థానాలు, భారతీయ జనతా పార్టీకి 88 స్థానాలు, సి.పి.యం కు 32 స్థానాలు లభించాయి. నవంబర్ 29వ తేదీ రాజీవ్ గాంధీ రాజీనామా చేశాడు. నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడానికి ముందుకు వచ్చింది. డిసెంబర్ 1వ తేదీ జనతాదళ్ పార్లమెంటు సభ్యులు సమావేశమై వి.పి. సింగ్‌ను తమ పార్లమెంటరీ పార్టీ నాయకుడిగా ఎన్నుకున్నారు. సి.పి.యం, సి.పి.ఐ, ఆర్.ఎస్.పి, ఫార్వర్డ్ బ్లాక్, బి.జె.పి మొదలైన పార్టీలు వెలుపలి నుంచి మద్దతు నివ్వడానికి అంగీకరించాయి. డిసెంబర్ 2వ తేదీ వి.పి.సింగ్ ఏడవ ప్రధానమంత్రిగా పదవీ బాధ్యతలు స్వీకరించాడు.



వి.పి.సింగ్

మండల్ కమిషన్ సిఫార్సులను అమలు చేయడానికి వి.పి.సింగ్ ప్రభుత్వం నిర్ణయించింది. విద్యాపరంగా, సామాజికంగా వెనుకబడిన తరగతులకు ప్రభుత్వరంగ ఉద్యోగాలలో 27 శాతం రిజర్వ్ చేయాలన్నది మండల్ కమిషన్ ముఖ్యమైన సిఫార్సు. ఇది ఉత్తర భారతదేశం విద్యాసంస్థలలోని విద్యార్థులలో ఆందోళన కలిగించింది. అలజడికి పూనుకున్నారు. కొందరు ఆత్మాహుతికి పాల్పడ్డారు. ఒకనెల పాటు విద్యాసంస్థలన్నిటినీ మూసివేశారు. 1990 ఆగస్టులో ఢిల్లీలో ఆరంభమైన ఆందోళన ఇతర నగరాలకు కూడా వ్యాపించింది.

నవంబర్ 5వ తేదీ జనతాదళ్‌లో చీలిక ఏర్పడింది. దాదాపు 70 మంది పార్లమెంటు సభ్యులు చంద్రశేఖర్‌నుతమనాయకుడిగా ఎన్నుకున్నారు. ప్రభుత్వానికి ఇచ్చిన మద్దతును ఉపసంహరించుకుంటున్నట్టు బి.జె.పి. ప్రకటించింది. కాంగ్రెస్ (ఐ) సభ్యులు చంద్రశేఖర్‌కు తమ మద్దతును తెలియజేశారు. లోక్‌సభలో ప్రవేశపెట్టిన విశ్వాసతీర్మానం ఓడిపోవడంతో వి.పి. సింగ్ రాజీనామా చేశాడు.



చంద్రశేఖర్

నవంబర్10వ తేదీ భారతదేశ ఎనిమిదవ ప్రధాన మంత్రిగా చంద్రశేఖర్ పదవీ బాధ్యతలు చేపట్టాడు.

అయితే, చంద్రశేఖర్ ప్రభుత్వం కూడా అట్టేకాలం నిలబడలేదు. కాంగ్రెస్ తన మద్దతును ఉపసంహరించుకోవడంతో, ఆయన మంత్రిమండలి మైనారిటీ అయిపోయింది. 1991 మార్చ్ 6వతేదీ ఆయన రాజీనామా లేఖను సమర్పించాడు.

పదవ లోక్‌సభ ఎన్నికలు రెండు దశలలో జరిగాయి. మే 20కి మొదటి దశ ఎన్నికలు ముగిశాయి. ఎన్నికల ప్రచారంలో భాగంగా రాజీవ్ గాంధీ మే 21వ తేదీ తమిళనాడు రాష్ట్రానికి వచ్చాడు.

చెన్నయ్ సమీపంలోని శ్రీపెరంబుదూరు దగ్గర ఎన్నికల ప్రచారసభలో పాల్గొంటూ



పి.వి.నరసింహారావు

ఉన్నప్పుడు మానవ బాంబు ప్రేలడంతో మరణించాడు.ఎల్.టి.టి.ఇ.ఆత్మాహుతి దళానికిచెందినఒక స్త్రీ ఈ దారుణానికి పాల్పడింది. రెండవ దశ ఎన్నికలు ఇరవై రోజులు వాయిదా పడ్డాయి. ఈ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ తన మిత్రపక్షాలతో కలిసి 220 స్థానాలు గెలుచుకున్నది. కాంగ్రెస్ పార్లమెంటరీ నాయకుడుగా పి.వి. నరసింహారావు ఎన్నుకోబడ్డాడు. జూన్ 21వ తేదీ ఆయన ప్రధానమంత్రి పదవీ భాధ్యతలు స్వీకరించాడు.

♦ ఇరవై భారతీయ భాషలలో 25,000 కు పైగా పాటలు పాడి, మధుర గాయని లతా మంగేష్కర్ 1984 గిన్నిస్ బుక్ అఫ్ వరల్డ్ రికార్డ్సులో స్థానం సంపాదించారు.



లతా మంగేష్కర్

# బయటి ప్రపంచంలో ....

❖ 1986 ఏప్రిల్ 26వ తేదీ సోవియట్ యూనియన్‌లోని చెర్నోబిల్ అటామిక్ సెంటర్‌లో నాలుగు రియాక్టర్లకు నిప్పంటుకోవడంతో ప్రపంచంలోనే అతి పెద్ద 'న్యూక్లియర్ ట్రాజెడీ' ఏర్పడింది. యూరపులోని వివిధ దేశాలలో అణు పదార్థాలతో నిండిన పొగ వ్యాపించింది. దాని ప్రభావం మనదేశంలోకూడా కనిపించింది

❖ 1990 ఆగస్టులో ఇరాక్ సేనలు కువైట్ మీదికి దాడి వెళ్ళడంతో గల్ఫ్ యుద్ధం ఆరంభమయింది. కువైట్ నుంచి ఇరాక్ సేనలను ఉపసంహరించుకోవాలని అరబ్ లీగ్ దేశాలు కోరాయి. సౌదీ అరేబియా విజ్ఞప్తి మేరకు అమెరికా ఇరాక్ మీదికి యుద్ధానికి వెళ్ళింది. 1991 ఫిబ్రవరి నాటికి కాల్పుల విరమణ జరిగింది.

● స్వీడన్‌లోని ఒక సంస్థ ప్రప్రథమంగా సెల్యూలార్ టెలిఫోన్స్‌ను ప్రవేశపెట్టింది. (1979).



# మసీదు-మందిరం వివాదాలు


శంకర్ దయాళ్‌శర్మ

1992 జూలై 14వ తేదీ ఉప రాష్ట్రపతి డా॥శంకర్ దయాళ్‌శర్మ తొమ్మిదవ భారత రాష్ట్రపతి అయ్యాడు.

1992 డిసెంబర్ 6వ తేదీ- ఉత్తర ప్రదేశ్ అయోధ్యలోని బాబ్రీ మసీదును కొందరు కరసేవకులు పడగొట్టడంతో మసీదు మందిరం వివాదం తారా స్థాయికి చేరుకున్నది. బాబ్రీ మసీదు ఉన్న చోట ఒకప్పుడు రామమందిరం ఉండేదనీ, మొగలుల దురాక్రమణ సమయంలో దానిని పడగొట్టి మసీదుకట్టారనీ ఒక వివాదం ఉన్నది.బాబ్రీమసీదు విధ్వంసం దేశవ్యాప్తంగా దిగ్భ్రాంతి కలిగించింది.మత కలహాలు చెల రేగాయి. పర్యవసానంగా ఉత్తర ప్రదేశ్, రాజస్థాన్, మధ్య ప్రదేశ్, హిమాచల ప్రదేశ్‌ల లోని బి.జె.పి. ప్రభుత్వాలు రద్దు చేయ బడ్డాయి.

1993లో మహారాష్ట్రలో పెద్ద భూకంపం వచ్చింది. లాటూరు,ఉస్మానాబాదు జిల్లాలు దెబ్బతిన్నాయి. దాదాపు 10,000 మంది ప్రాణాలు కోల్పోయారు.

నర్మదానది మీద వున్న సర్దార్ సరోవర్ డ్యాం (ఆనకట్ట) ఎత్తును పెంచాలని గుజరాత్ ప్రభుత్వం ప్రయత్నించింది. దీనికి వ్యతిరేకంగా మహారాష్ట్రలో ఉద్యమం బయలుదేరింది. దీనివల్ల మహారాష్ట్రలో అటవీ సంపద నాశమవుతుందనీ, మానవ నివాసానికి అపాయంవాటిల్లుతుందనీ పర్యావరణశాస్త్రజ్ఞులు అభిప్రాయపడ్డారు. తమ గ్రామాలను ఖాళీ చేసి వెళ్ళేవారికి పునరావాస ఏర్పాట్లు, చేయగలమని ప్రభుత్వం హామీ ఇవ్వడంతో వ్యతిరేక ఉద్యమం తాత్కాలికంగా ఆగింది.

1994లో జమ్ము కాశ్మీరులో అధ్యక్ష పాలన మరొక ఆరునెలలు పొడిగించబడింది. అయినా అక్కడ తీవ్రవాదుల హింసాకాండకు అదుపులేకుండా పోయింది. అంతర్జాతీయ మానవ హక్కుల కమిషన్ సమక్షంలో కాశ్మీరుపై ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టడానికి, ఫిబ్రవరి 26వ తేదీ పాకిస్తాన్ ప్రయత్నించింది. భారత దేశం దానిని వ్యతిరేకించింది. మధ్యవర్తిత్వ ప్రతిపాదనను ఇండియా తిరస్కరించింది.

1995 జూలైలో కాశ్మీర్ తీవ్రవాదులు పర్యాటకుల మీద దాడి జరిపి పహాల్‌గామ్ నుంచి ఆరుగురు విదేశీయులను అపహరించుపోయారు. వాళ్ళను వదిలి పెట్టాలంటే భారతదేశంలో జైళ్ళలోఉన్న 17మంది తీవ్రవాదులను విడుదల చేయాలని షరతు పెట్టారు. వారిలో ఇరువురు తప్ప మిగిలిన వారు కాశ్మీరుకు చెందినవారుకారనీ,పాకిస్తాన్,

ఆఫ్ఘనిస్తాన్ నుంచి వచ్చిన తీవ్రవాదులనీ చెప్పి, వాళ్ళ డిమాండును ప్రభుత్వం తోసిపుచ్చింది.

అంతకు ముందు అంటే 1995 మే 11వ తేదీ తీవ్రవాదులు శ్రీనగర్‌కు సమీపంలోని చరార్-ఇ-షెరీఫ్ మసీదును తగుల బెట్టారు. అది రెండు నెలల పాటు పాకిస్తాన్ సాయం పొందుతున్న తీవ్రవాదుల అదుపులో ఉన్నది. 15వ శతాబ్దానికి చెందిన సుప్రసిద్ధ సూఫీ సాధువు షేక్ నూరుద్దీన్ నూరానీని సమాధి చేసిన మసీదు అది. హిందూ-ముస్లిం ఐక్యతను ఆయన బోధించాడని చెబుతారు. హిందువులు ఆయన్ను నంద్ ఋషి అని పిలిచేవారు. యాభైలలో దానిని షేక్ అబ్దుల్లా పునర్నిర్మించినప్పటి నుంచి ఆ మసీదు హిందు-ముస్లిం యాత్రీకులను ఆకర్షిస్తూ ఉండేది.

♦ 2000 జూలై 24వ తేదీ జరిగిన ఇంటర్నేషనల్ చెస్ టోర్నమెంట్‌లో ఎస్.విజయలక్ష్మి ప్రథమ మహిళా గ్రాండ్ మాస్టర్‌గా గెలిచారు.



# బయటి ప్రపంచంలో ....

❖ దక్షిణ ఆఫ్రికాలో నల్లజాతి ప్రజల కోసం స్వాతంత్ర్య ఉద్యమాన్ని నడిపి, 26 సంవత్సరాలు జైలువాసం చేసిన నెల్సన్ మండేలా 1990 ఫిబ్రవరి 11వ తేదీ విడుదలయ్యాడు.



- ఇద్దరు సోవియట్ అంతరిక్షగాములు స్పేస్ క్రాఫ్ట్‌లోనే 175 రోజులు గడిపి నూతన చరిత్రను సృష్టించారు (1979).
- 1979లో జపాను తయారు చేసిన 'వాక్మన్ పర్సనల్ స్టీరియోలు' మార్కెట్‌లోకి వచ్చాయి.



# సి టి బి టి కి ఇండియా వ్యతిరేకత


హెచ్.డి. దేవగౌడ

1996వ సం॥లో భారతదేశం ముగ్గురు ప్రధానులను చూసింది. 11వ లోక్ సభ ఎన్నికలలో కాంగ్రెస్ మెజారిటీ కోల్పోయింది. పి.వి.నరసింహారావురాజీనామా చేశాడు. అధిక స్థానాలు గెలుచుకోవడం వల్ల బిజెపి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తానన్నది. మే 16వ తేదీ వాజ్‌పేయి ప్రధాన మంత్రి అయ్యాడు. అయితే, మే 28వ తేదీ ప్రవేశపెట్టిన విశ్వాస తీర్మానం మీద గెలువలేకపోయాడు. ఆయన కూడా రాజీనామా చేశాడు.

ఆ తరవాత 13 పార్టీలు చేతులు కలపడంతో యునైటెడ్‌ఫ్రంట్ ఏర్పడింది. హెచ్.డి.దేవగౌడనాయకుడుగాఎన్నుకోబడ్డాడు. జూన్ 1వ తేదీ ప్రధాన మంత్రి పదవిని చేపట్టాడు.

అణ్వాయుధాల నియంత్రణ కోసం జెనీవాలో జరిగిన ప్రపంచ సభలో సమగ్ర అణ్వాయుధపరీక్షనిషేధఒప్పందాన్నికాంప్రెహెన్సివ్ టెస్ట్ బ్యాన్ ట్రీటి (సిటిబిటి)ని, వ్యతిరేకించింది.అణ్వాయుధాలుతయారు చేస్తూన్న దేశాలు తమ ఆయుధ సేకరణను పెంచకుండా ఉండడానికి అంగీకరించనంత కాలం సి టి బి టి లాంటి ఒప్పందాలవల్ల ఎలాంటి ప్రయోజనమూ ఒరగబోదని ఇండియా వాదించింది. మూడవ ప్రపంచ దేశాలు అలాంటి ఆయుధాల బెడదను ఎదుర్కోవలసి వుంటుందని ఇండియా స్పష్టం చేసింది.

ఇండియా వాదానికి మంచి స్పందనలభించింది. సి టి బి టిలో సంతకం చేయడానికి నిరాకరించింది.


ఐ.కె.గుజరాల్

1997లో ఇండియాను ఇద్దరు ప్రధాన మంత్రులు పాలించారు. ఏప్రిల్ 11వ తేదీ దేవగౌడ ప్రవేశపెట్టిన విశ్వాస తీర్మానాన్ని లోక్‌సభ తిరస్కరించింది. ఆయన రాజీనామా చేశాడు. అంతకు పూర్వం మార్చ్ 30వ తేదీ యునైటెడ్ ఫ్రంటుకు ఇస్తూన్న మద్దతును కాంగ్రెస్ ఉపసంహరించుకున్నది. ఏప్రిల్ 21వ తేదీ ఐ.కె. గుజ్రాల్ ఫ్రంట్ నాయకుడుగా ఎన్నికయ్యాడు. ఆయన



కె.ఆర్. నారాయణన్

12వ ప్రధాన మంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టాడు. అయితే ఆయన మంత్రి మండలి కూడా అట్టే కాలం సాగలేదు. నవంబర్ 28వ తేదీ కాంగ్రెస్ మద్దతు ఉపసంహరించుకున్నది. ఆయన రాజీనామా చేసి లోక్‌సభ రద్దుకు సిఫార్సు చేశాడు. రాష్ట్రపతి లోక్‌సభను రద్దు చేసి ఎన్నికలు ప్రకటించాడు.

1997 జూలై 25వ తేదీ కె.ఆర్. నారాయణన్ భారతదేశానికి పదవ రాష్ట్రపతిగా ప్రమాణ స్వీకారం చేశాడు.

♦ 1983 జూన్ 25వ తేదీ ప్రప్రథమంగా ఇండియా వరల్డ్ కప్ క్రికెట్‌ను గెలుచుకున్నది. లండన్‌లోని లార్డ్స్‌లో 43 పరుగులతో వెస్ట్ ఇండీస్‌ను ఓడించింది. 1932 జూన్ 25వతేదీ ఇంగ్లాండులోని లార్డ్స్‌లోనే ఇండియా ఇంగ్లాండుతో తొలి టెస్ట్ మ్యాచ్ ఆడిందన్న విషయం ఇక్కడ చెప్పుకో తగ్గ విశేషం!

# బయటి ప్రపంచంలో ....

❖ బలమైన సోవియట్ యూనియన్ విచ్ఛిత్తి జరిగి, యూనియన్ ప్రదేశాలు స్వతంత్ర దేశాలుగా విడిపోవడంతో యూరపులో కమ్యూనిజం పతనమయింది. బోరిస్ ఎల్‌స్టిన్ అధికారాన్ని అప్పగించమని గార్బచేవ్‌ను నిర్బంధించాడు. 1991 డిసెంబర్ 24వ తేదీ ఎల్‌స్టిన్ రష్యా రిపబ్లిక్ ప్రెసిడెంట్ అయ్యాడు.



బోరిస్ ఎల్‌స్టిన్

● రిచర్డ్ అటెన్‌బరో దర్శకత్వం వహించిన 'మహాత్మా గాంధీ' చలన చిత్రం 1982లో విడుదలయింది. ఉత్తమ చిత్రం, ఉత్తమ దర్శకత్వం, ఉత్తమ నటుడు (గాంధీజీగా నటించిన బెన్ కింగ్స్‌లీ) మొదలైన 8 ఆస్కార్ అవార్డులను సాధించింది చిత్రం.

# అణ్వాయుధ పరీక్షలు

1998 మార్చిలో 12వ లోక్‌సభ ఎన్నికలు జరిగాయి.ఏ పార్టీకిగాని మెజారిటీ రాలేదు. బి.జె.పి. దాని మిత్ర పక్షాలకు 277 స్థానాలు, కాంగ్రెస్‌కు 141 స్థానాలు వచ్చాయి. బి.జె.పి. నాయకత్వం వహించే సంకీర్ణానికి అటల్‌బిహారీ వాజ్‌పేయి నాయకుడయ్యాడు. మార్చ్ 19వ తేదీ ఆయన 12వ ప్రధాన మంత్రిగా పదవీ ప్రమాణ స్వీకారం చేశాడు. మార్చ్ 28వ తేదీ ప్రవేశ పెట్టిన విశ్వాస తీర్మానంలో 13 ఓట్ల ఆధిక్యతతో నెగ్గాడు.

ఏ.బి.వాజ్‌పేయి

1998 మే 11వ తేదీ రాజస్థాన్‌లోని పోఖ్రాన్‌లో భారతదేశం మరొకసారి అణ్వాయుధ పరీక్ష జరిపింది. రిమోట్ కంట్రోల్‌తో అణ్వాయుధ పరీక్షలు నిర్వహించడానికి కావలసిన శక్తి తనకు ఉన్నదని నిర్ధారించుకోవడానికిరెండు రోజుల తర్వాత మళ్ళీఒకసారి పరీక్షలుజరిపింది.

1999లో బీహారు, ఆంధ్రప్రదేశ్, జమ్మూ-కాశ్మీరు, ఒరిస్సా, ఢిల్లీ, త్రిపుర మొదలైన ప్రాంతాలలో మళ్ళీ తీవ్రవాద కార్యకలాపాలు తలెత్తసాగాయి. నేపాల్‌లోని ఖాఠ్మండు నుంచి ఢిల్లీకి వస్తూన్న విమానాన్ని డిసెంబర్ 24వ తేదీ తీవ్రవాదులు దారి మళ్ళించారు.మరునాడు అది ఆఫ్ఘనిస్తాన్‌లోని కాంధహార్ విమానాశ్రయంలో దిగింది. ఆరు రోజుల చర్చలు, మంతనాల తరవాత 189 మంది ప్రయాణీకులు సురక్షితంగా బయటపడ్డారు.



న్యూఢిల్లీ, లాహోర్‌ల మధ్య బస్సు సర్వీసు నడపాలని భారత్, పాకిస్తాన్ ప్రభుత్వాలు నిర్ణయించాయి. 1999 ఫిబ్రవరి 1వ తేదీ ఢిల్లీ నుంచి లాహోర్‌కు వెళ్ళిన మొదటి బస్సులో ప్రధాన మంత్రి వాజ్‌పేయి ప్రయాణం చేశాడు. మరునాడు ఉభయదేశాల మధ్య మైత్రీ సంబంధాలు పెంపొందించుకోవడానికి వీలుగా లాహోర్ తీర్మానంలో వాజ్‌పేయి సంతకం చేశాడు.

కాశ్మీరు సరిహద్దులోని కార్గిల్ ప్రాంతాన్ని పాకిస్తాన్ చొరబాటు దారులు ఆక్రమించుకున్నారు. కార్గిల్ నుంచి చొరబాటు దారులను వెళ్ళగొట్టడానికీ, మరింత చొరబాటును అరికట్టడానికీ, భారత్ చిన్న యుద్ధం చేయవలసివచ్చింది. 1999 మే 26నుంచి 74 రోజుల పాటు యుద్ధం కొనసాగింది.

లోక్‌సభలో ఒక ఓటు తేడాతో వాజ్‌పేయి ప్రభుత్వం పడిపోయింది. ఏప్రిల్ 26వ తేదీ లోక్‌సభ రద్దయింది. సెప్టెంబర్‌లో ఐదు దశలలో ఎన్నికలు జరిగాయి. బి.జె.పి నాయకత్వంలోని జాతీయ ప్రజాస్వామ్య కూటమి (నేషనల్‌డెమొక్రటిక్ అలయెన్స్) 269 స్థానాలు గెలుచు



కున్నది. తెలుగుదేశం పార్టీ మద్దతుతో ఎన్.డి.ఏ. మళ్ళీ అధికారం చేపట్టింది. అటల్ బిహారీ వాజ్‌పేయి మళ్ళీ ప్రధాని అయ్యాడు. ఆయన 1999 అక్టోబర్ 13వ తేదీ 70 మంత్రులతో మంత్రి మండలిని ఏర్పాటు చేశాడు.

◆ 1985లో జకార్తాలో జరిగిన 'ఏసియన్ ట్రాక్ అండ్ ఫీల్డ్ మీట్'లో పి.టి.ఉష ఇండియా తరఫున పాల్గొని ఐదు బంగారు పతకాలను (ఒకటి రిలేలో), ఒక కాంశ్య పతకాన్నీ సాధించింది. భారతీయ క్రీడా కారిణులలో రికార్డు సృష్టించింది.



◆ 2000 డిసెంబర్ 24వ తేదీ టెహ్రాన్‌లో విశ్వనాధన్ ఆనంద్ వరల్డ్ చెస్ టైటిల్‌ను సాధించాడు. ప్రపంచ చాంపియన్ షిప్ సాధించిన తొలి ఆసియా ఖండవాసి ఆనంద్.



# బయటి ప్రపంచంలో ....

❖ 45 సంవత్సరాలుగా సాగుతూన్న పాలస్తీనా సమస్య పరిష్కారం కోసం, అమెరికా ప్రెసిడెంట్ బిల్ క్లింటన్ చూపిన చొరవ కారణంగా శాంతి చర్చలు ఆరంభమయ్యాయి. 1993 సెప్టెంబర్ 13వ తేదీ ఇజ్రాయెల్ ప్రధాన మంత్రి ఇట్జక్



యాసర్ ఆరాఫత్

రాబిన్, పాలస్తీనా విముక్తి సంస్థ అధ్యక్షుడు యాసర్ ఆరాఫత్-స్వతంత్ర పాలస్తీనా, స్థాపనకు శాంతి చర్చలు కొనసాగించడానికి అంగీకరించారు.

● 1982 డిసెంబర్ 2వ తేదీ ఉటా యూనివర్సిటీ వైద్య కేంద్రానికి సంబంధించిన డాక్టర్లు- ఫైబర్ గ్లాస్, పాలీ రాథీన్ మిశ్రమంతో తయారుచేసిన కృత్రిమ గుండెను - 61 ఏళ్ళరోగికి విజయవంతంగా అమర్చారు!



# భారత్ వైఖరికి అమెరికా, రష్యా మద్దతు

20-వ శతాబ్ది ఆఖరి సంవత్సరంలో ఇద్దరు ప్రపంచ నాయకులు భారతదేశ పర్యటనకు వచ్చారు. అమెరికా ప్రెసిడెంట్ బిల్ క్లింటన్ గత సంవత్సరం ప్రథమార్ధంలోనూ;రష్యా ప్రెసిడెంట్ వ్లాడిమీర్ పుతిన్ ద్వితీయార్ధంలోనూ మన దేశానికి వచ్చారు. మార్చ్ 19,20 తేదీలలో బిల్ క్లింటన్ ఇండియాలో గడిపాడు. గత ఇరవై యేళ్ళలో అమెరికా ప్రెసిడెంట్ ఇండియాకు రావడం ఇదే ప్రథమం.


బిల్‌క్లింటన్

సరిహద్దు ప్రాంతంలో పాకిస్తాన్ రెచ్చగొడుతున్న తీవ్రవాదాన్ని క్లింటన్ విమర్శించాడు. ద్వైపాక్షిక చర్చలు జరిగి, ఇండో-పాక్ ఉద్రిక్తత తగ్గాలంటే మొదట నియంత్రణ రేఖను గౌరవించడం తప్పనిసరి అని ఆయన అభిప్రాయం వెలిబుచ్చాడు.

భారత్‌కు నాలుగురోజుల పర్యటనకు అక్టోబర్ 2వ తేదీ వచ్చిన రష్యా ప్రెసిడెంట్ వ్లాడిమీర్ పుతిన్,ఇండో-పాక్ వివాదంలో విదేశీ జోక్యాన్ని ఖండించాడు. శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తిని ఉపయోగించాలనే లక్ష్యంతో ఉభయ దేశాలు పరస్పర సహకారం పెంపొందించుకోవాలన్న అవగాహనాపత్రం మీద భారత్ సంతకం చేసింది.

మూడు కొత్తరాష్ట్రాల ఏర్పాటును 2000వ సం॥ ముఖ్యమైన విశేషంగా చెప్పుకోవచ్చు. మధ్య ప్రదేశ్ నుంచి విడదీసిన చట్టీస్ ఘడ్ రాష్ట్రం అక్టోబర్ 31వ తేదీ ఏర్పాటయింది. ఉత్తర ప్రదేశ్‌లోని కొన్ని జిల్లాలను కలిపి నవంబర్ 8న ఉత్తరాంచల్ రాష్ట్రం ఏర్పాటు చేయబడింది. భారత యూనియన్‌లోని 28వ రాష్ట్రమయిన జార్ఖండ్, బీహార్ నుంచి విడదీయబడి నవంబర్ 14వ తేదీ ఏర్పాటు చేయబడింది.

అర్ధ శతాబ్దకాలంగా అమలులో ఉంటూన్న భారత రాజ్యాంగ చట్టాన్ని పునఃపరిశీలించాలని వాజ్‌పేయి ప్రభుత్వం భావించింది. అందుకోసం 11 సభ్యులు గల నేషనల్ కమిషన్‌ను నియమించింది. లోక్‌సభ పరిమాణం (545 స్థానాలు) మరో పాతిక సంవత్సరాలు మార్పు లేకుండా అలాగే ఉంటుందని కూడా వాజ్‌పేయి ప్రభుత్వం నవంబర్15వ తేదీ ఒక నిర్ణయం తీసుకున్నది.

కాశ్మీరులో తీవ్రవాద కార్యకలాపాలు కొనసాగుతూనే ఉండడం వల్ల, ఇండో-పాక్‌చర్చలకు అవకాశం లేకుండానే ఒక సంవత్సరం గడిచిపోయింది. సరిహద్దు రేఖకు ఇరువైపులా అప్పుడప్పుడు కాల్పులు జరుగుతూనే ఉన్నాయి. ప్రధాని వాజ్‌పేయి నవంబర్ 19వ తేదీ పవిత్ర రంజాన్ నెల పూర్తిగా జమ్మూ - కాశ్మీరులో కాల్పుల విరమణను ఏకపక్షంగా ప్రకటించడంలో ఎంతో వితరణను ప్రదర్శించాడు.

కాశ్మీరులో స్వయం నిర్ణయాధికారం గురించి ఐక్యరాజ్య సమితి చేసిన తీర్మానాలు గడువు దాటి పోవడంవల్ల అవి ఇప్పుడు చెల్లవని వాజ్‌పేయి ప్రకటించాడు. డిసెంబర్ 20వ తేదీ కాల్పుల విరమణను మరొక నెల పాటు అంటే 2001 జనవరి 21వతేదీవరకు పొడిగించాడు. —(అయిపోయింది)


వ్లాడిమీర్ పుతిన్




# డబ్బుకంటే గొప్పది!

సీతాపతి వ్యవసాయంలో దిట్ట. సేద్యంలో మెలుకువలు తెలుసుకునేందుకు, చాలా మంది రైతులాయన దగ్గరకు వస్తూంటారు. అందరికీ ఆయన మంచి సలహాలు ఇవ్వడంతోపాటు,వ్యవసాయం గొప్పతనం గురించి చెబుతూండేవాడు.

రఘుపతి, సీతాపతి ఒక్కగానొక్క కొడుకు. చాలాబుద్ధిమంతుడు;తెలివైనవాడు.చదువుకుంటే వ్యవసాయంలో మరింత రాణిస్తాడన్న ఉద్దేశంతో సీతాపతి, కొడుకును పట్నంలో గురుకులానికి పంపాడు.

నాగరికత వృద్ధిచెందడంతో గురుకులాలు అడవులనుంచి నగరాల నడిబొడ్డుకు చేరాయి. చదువుకునే వారి సంఖ్యకూడా పెరగడంతో, నిరుద్యోగమూ పెరిగింది. అందువల్ల, గురుకులాల్లో శాస్త్రాలూ, పురాణాలూ మాత్రమే కాక స్వయంఉపాధికి దారితీసే పలు వృత్తి విద్యలు కూడానేర్పసాగారు. వాటిలో వ్యవసాయం కూడా ఒకటి.

రఘుపతి గురుకులంలో చేరి వ్యవసాయానికిసంబంధించిన శాస్త్రీయ విశేషాలు చాలా తెలుసుకున్నాడు. సెలవుల్లో ఇంటికి వెళ్ళినప్పుడల్లా, అతడు తను తెలుసుకున్న విశేషాలను తండ్రితో చర్చించేవాడు. కొడుకు జ్ఞానానికి సీతాపతి తెగ మురిసిపోయేవాడు.

కొంత కాలానికి రఘుపతి చదువు పూర్తయింది. అయితే, వాడికి నగరజీవితం మీద మోజు మాత్రం తీరలేదు. తను గ్రామంలో వుండలేననివాడు తండ్రికి ఖచ్చితంగాచెప్పేసి, ''నేను పట్నంలో పెద్ద ఎత్తున పరిశ్రమ నెలకొల్పుతాను. వ్యవసాయ ఉత్పత్తుల నుంచి జనాకర్షణీయమైన తినుబండారాలు, ఇతరత్రా వస్తువులుతయారుచేస్తాను.మనం తరతరాలుగా వ్యవసాయంచేసి సంపాదించిన దానికి పదిరెట్లు, ఒక్క ఏడాదిలో సంపాదిస్తాను,'' అన్నాడు.

కొడుకు పల్లెటూరు విడిచిపెట్టడమూ, వ్యవసాయంచేయకపోవడమూ సీతాపతికి

''వసుంధర''



నచ్చలేదు. ఆయన రఘుపతితో, ''బాబూ! వ్యవసాయం మన కుటుంబ సంప్రదాయం. మనవంటి వాళ్ళచేతుల్లోనే సేద్యంరాణిస్తుంది. పదిమందికి తిండిపెట్టడంలోవున్న ఆనందం, ఆదాయం పెంచుకుంటే పెరుగుతుందను కోవడం తెలివితక్కువ!'' అని నచ్చచెప్ప బోయాడు.

ఇందుకు రఘుపతి అంగీకరించక, ''నాన్నా! వ్యవసాయం చేసినువ్వు పదిమందికి తిండి పెడుతూంటే,పరిశ్రమ స్థాపించి నేను వందలాదిమందికి ఉపాధి కల్పిస్తాను. వ్యవ సాయకుటుంబంనుంచి వచ్చినవాణ్ణి కాబట్టి, నావల్లరైతులకుకూడా మేలుజరుగుతుంది!'' అన్నాడు.

ఇలా కొంతసేపు చర్చించుకున్నాక,కొడుకు మాటల్లో నిజమున్నదని సీతాపతికి అనిపించి, చివరకు సరేనన్నాడు. అయితే, పరిశ్రమ ప్రారంభించాలంటే కనీసం లక్ష వరహాలు కావాలి. అంత డబ్బు ఆయన వద్ద లేదు. అప్పుగా ఇచ్చేవారా ఊళ్ళోనూ లేరు.

''నగరంలో ఎందరో వడ్డీ వ్యాపారు లున్నారు. మన పొలం తాకట్టుపెడితే, ఎవ రైనా అప్పు ఇస్తారు. పరిశ్రమ ప్రారంభించాక చకచకా ఆ బాకీ తీర్చేయొచ్చు,'' అన్నాడు రఘుపతి, తండ్రికి సలహాయిస్తూ.

అన్నంపెట్టే పొలాన్ని తల్లిగా భావిస్తూ, నీడనిచ్చిన ఇంటిని తండ్రిలా భావిస్తూ గుట్టుగా జీవితం గడుపుతున్న సీతాపతికి, ఈ సలహా నచ్చలేదు.

అప్పుడు రఘుపతి నగరంలోని కొందరు బంధువుల పేర్లు చెప్పాడు. వాళ్ళందరూ కోట్లకు పడగలెత్తినవారేకాని,ఇటీవల ఎవ్వరి తోనూ రాకపోకలులేవు.ఆ కారణం వల్ల సీతా పతి, ''బాబూ! అడిగి లేదనిపించుకుంటే నాకు తలతీసేసినట్లుంటుంది. ఖచ్చితంగా ఇస్తారని నువ్వనుకునేవారెవరైనావుంటే చెప్పు. నేనడుగుతాను,''అన్నాడు.

''నాన్నా! నీవన్నీ హిరణ్యాక్షవరాలు.నాకు సాయపడే వుద్దేశం నీకులేదు,'' అని చిన్న బుచ్చుకున్నాడు రఘుపతి.

కొడుకు తనమీద అలాంటినెపంవేయడం, సీతాపతి మనసుకు కష్టం కలిగించింది. ఆయన తన నిజాయితీని నిరూపించు కునేందుకు ఏం చేయాలా అని తీవ్రంగా ఆలోచించగా, కమల గుర్తుకొచ్చింది.

కమల, సీతాపతి పెదనాన్న కూతురు. కట్నం విషయంలో పేచీవచ్చి, ఆమె పెళ్ళి ఆగిపోయేలావుంటే, అవసరానికి డబ్బిచ్చి ఆదుకున్నాడు సీతాపతి. ఆ రోజున కమల

ఆయన రెండు చేతులూ పట్టుకుని, ''అవసరానికి తోడబుట్టినవాళ్ళుకూడా ముఖం చాటేసిన సమయంలో, నువ్వు చేసిన ఈ సాయం నేను జీవితాంతం గుర్తుంచుకుంటాను. కుచేలుడి అటుకులకు కృష్ణుడిచ్చిన రీతిలో నీకు ప్రతిఫలాన్నివ్వాలని, నా ఆశయం. భగవంతుడు అందుకు తప్పక సహకరిస్తాడనే, నా ఆశ!'' అన్నది.

భగవంతుడామెకు నిజంగానే సహకరించాడు! పెళ్ళయినరెండేళ్ళకే ఆమె భర్త, చేస్తూన్న చిన్న ఉద్యోగం మానేసి వ్యాపారం ప్రారంభించాడు.అప్పటినుంచీ వాళ్ళ జీవితం మూడుపువ్వులూ,ఆరుకాయలైంది.

సీతాపతి, కొడుకును వెంటబెట్టుకుని, కమలవుండే నగరం చేరుకున్నాడు. కమల వాళ్ళిద్దరికీ ఘనమైన ఆతిథ్యం ఇచ్చింది. ఆలస్యం చెయ్యకుండా సీతాపతి, కమలకు తను వచ్చిన పని చెప్పాడు.

కమల ముఖం చిన్నబోయింది. ఆమె దిగులుగా, ''అన్నయ్యా! ఎవరికీ అప్పివ్వకూడదన్నది, నా భర్త సిద్ధాంతం. అయితే, ఆయనలేదని మాత్రం అనడు. తనవద్దకు వచ్చినవారిని ఏదోకారణం చెప్పి పంపేస్తాడు. నువ్వు ఒకరోజంతా ఆయనను గమనించు. అప్పడిగినవారికి ఏయే కారణాలు చెబుతాడో విను.ఆయనఏకారణాలూ చెప్పలేని విధంగా అడగ్గలవేమో ఆలోచించుకో. నాకు తెలిసి ఇంతవరకూ ఒక్కరుకూడా ఆయన్నుంచి అప్పు సంపాదించలేదు,'' అన్నది.

ఆయన ఆమె మాటను పాటించి, మరసటిరోజంతా కమల భర్త పక్కనే వుంటూ జరుగుతున్నది గమనించాడు.




ఒకాయన తన కూతురు పెళ్ళికి కట్నం డబ్బు తక్కువైందని, అప్పుకు వచ్చాడు. కమల భర్త ఆయనతో, ''అప్పుచేస్తే అది తీర్చే దారికూడా చూసుకోవాలిగదా!అయినా, వరకట్నం తప్పు.నేనందుకు సహకరించను. అనవసరంగా పెద్దఎత్తుకు పోకుండా, నీకు తగ్గ సంబంధం చూసుకో,సుఖపడతావు,'' అంటూ ఆయనను మందలించాడు.

మరొకాయన అప్పుకువస్తే, ''ఎదిగిన కొడుకును ఇంట్లో పెట్టుకుని,నన్నప్పడుగుతావేమిటి? పెళ్ళి చేస్తానన్నావంటే అడిగినంత కట్నమిచ్చే ఆడపిల్లల తండ్రులు బోలెడు మందివున్నారు!'' అంటూ నవ్వుతూ సలహా ఇచ్చాడు.

కట్నం తీసుకోవడం తన ఆదర్శానికి విరుద్ధమని ఆయన అంటే, ''నువ్వు నీ ఆదర్శాన్ని వదలనప్పుడు, నేను నా ఆదర్శాన్ని

ఎందుకు వదలాలి? అప్పివ్వక పోవడం నా ఆదర్శం,'' అన్నాడు కమలభర్త.

ఇలా చాలామందికి జరిగాక, తండ్రితో పాటు ఇదంతా చూసిన రఘుపతికి, అక్కడ తమకు అప్పుపుట్టదని రూఢి అయిపోయింది. అయినా సీతాపతి, కమల భర్తను అప్పడగ డానికే నిశ్చయించుకున్నాడు. రఘుపతి, ''నాన్నా! నీ ఆదర్శాలు నమ్ముతున్నాను. నువ్వు అడిగిలేదనిపించుకుంటే భరించ లేను. మనం తిరిగి వెళ్ళిపోదాం,'' అన్నాడు.

సీతాపతి ఇందుకు ఒప్పుకోలేదు.ఆరాత్రి ఆయన కమల భర్తకు,తన కొడుకువ్యాపారం ప్రారంభించాలనుకుంటున్నాడని చెప్పి, లక్షవరహాలు అప్పు కావాలన్నాడు.

ఇది వింటూనే కమల భర్త ఆశ్చర్యంగా, ''ఇదేమిటి? వ్యాపారమా! వ్యవసాయాన్ని గురించిన నీ అభిప్రాయాలూ, నమ్మకాలూ చాలా గొప్పవి. నీ కొడుకు వాటికి భంగం కలిగించాలనుకుంటే, అందుకు నేనేమాత్రం సహకరించను!'' అన్నాడు.

''అయితే, నా అభిప్రాయాలూ, ఆశ యాలూ-అవేం గొప్పవి కావా?'' అన్నాడు రఘుపతి చిరాగ్గా.

''ఇతరుల నమ్మకాలకూ,ఆశయాలకూ భంగం కలిగించనప్పుడే,ఎవరి ఆశయాలైనా గొప్పవి అవుతాయి,''అన్నాడు కమలభర్త వెంటనే.

ఆ జవాబుతో రఘుపతికి విషయం అర్థమైంది.తను పరిశ్రమ ప్రారంభించాలను కుంటే,అందుకు తండ్రినుంచి డబ్బు ఆశించ కూడదు. స్వయంకృషితో తన లక్ష్యాన్ని సాధించాలి. ఇది అవగతం కాగానే రఘు పతి, కమల భర్తతో,''మీరు అప్పివ్వరని తెలిసీ అంతా మీ దగ్గరకు అప్పడగడానికి ఎందుకు వస్తారో, నా కిప్పుడు అర్థమైంది. మీరు వాళ్ళకు సమస్యలకు డబ్బు కంటే గొప్పదైన అసలు సిసలు పరిష్కారమార్గాన్ని చెప్పగలరు. మానాన్న కూడా అది తెలుసు కునేందుకే మిమ్మల్నిఅప్పడిగాడని, నేనిప్పుడు గ్రహించాను. నాకు జ్ఞానోదయమైంది. నేనీ పరిశ్రమల సంగతికి స్వస్తి చెప్పి, వ్యవ సాయంలో నాన్నతో చేయి కలపదలిచాను,'' అన్నాడు.

రఘుపతి నిర్ణయానికి అతడి తండ్రితో పాటు కమలా, ఆమెభర్తా ఎంతగానో సంతో షించారు.



63. ధృతరాష్ట్రుడి వానప్రస్థం

# మహాభారతం

ధర్మరాజూ, యాజ్ఞికులూ అడిగిన దానికి ముంగిస ఇలా చెప్పింది:

"నేనుఅబద్ధం చెప్పలేదు.ఈ యాగం పేల పిండిదానంతో సమంకాదు. రాలినగింజలు ఏరుకుని కురుక్షేత్రంలో నివసించిన మునీ, ఆయన భార్యా, కొడుకూ, కోడలూ కూడా స్వర్గానికి వెళ్ళారు.ఆయన వల్లనే నా శరీరంలో సగంభాగంబంగారంగా మారిపోయింది.

"నేను చెప్పిన బ్రాహ్మణుడు భార్యతోనూ, కొడుకు, కోడలితోనూ ఉంఛవృత్తితో, పక్షులు జీవించినట్టుగా జీవిస్తూ ఉండేవాడు. రోజుకు ఒక్కసారి వాళ్ళు ఆహారం తీసుకునేవారు.

"కరువు వచ్చింది. చెట్లూ చేమలూ మాడి పోయాయి. ఆ కుటుంబానికి రోజుకు ఒక సారి తినే అవకాశం కూడా పోయింది. ఒక నాటి మధ్యాహ్నం తీక్షణమైన ఎండలో కాలుతూ వాళ్ళు కొంత యవధాన్యం సంపాదించారు. దాన్ని వాళ్ళు పిండి కొట్టి, నాలుగు ముద్దలు చేసి,నలుగురూ పంచుకుని తినబోతుండగా ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు.

"ఆకలి మీద వున్న ఆ బ్రాహ్మణుణ్ణి వాళ్ళు లోపలికి ఆహ్వానించి, అర్ఘ్యపాద్యాలిచ్చి, దర్భాసనం మీద కూర్చోబెట్టారు. గృహస్థు తన అతిథికి తనవంతు పేలపిండి ముద్ద





ఇచ్చాడు. అతిథి దాన్ని ఆరగించి ఇంకా ఆకలి తీరనట్టు కనబడ్డాడు. అప్పుడు బ్రాహ్మణుడి భార్య తనవంతు ఆహారం కూడా అతిథికి ఇచ్చింది.ఆ తరవాత ఆ అతిథి బ్రాహ్మణుడి కొడుకువంతూ, కోడలివంతూ ఆహారం కూడా తిని, సంతోషించి, తాను యమధర్మరాజునని తెలుపుకుని, అందరికీ స్వర్గప్రాప్తి కలిగినట్టు చెప్పాడు.

"అయ్యాలారా,అప్పుడు నేను నా బిలంలో నుంచి పైకి వచ్చాను. ఆ పేలపిండి వాసన సోకటం చేతా, అక్కడి నీటిలో తడవటం చేతా నా తలా, సగం శరీరమూ బంగారంగా మారిపోయాయి. ఇక్కడ గొప్ప యాగం జరుగుతున్నదని తెలిసి, నా మిగిలిన శరీరం కూడా బంగారం చేసుకుందామని వచ్చాను. కాని నా ఆశ ఫలించలేదు," అంటూ ముంగిస అదృశ్యమయింది.

ధర్మరాజు తన తమ్ములతో సహా రాజ్య పాలన చేస్తున్నాడు. ధృతరాష్ట్రుణ్ణి విదురుడూ, సంజయుడూ, యుయుత్సుడూ, కృపుడూ కనిపెట్టుకుని ఉండేవారు. కుంతి ఎప్పుడూ గాంధారి వెంట ఉండేది. ద్రౌపదీ, సుభద్రా, పాండవుల ఇతర భార్యలూ వారి ద్దరినీ కనిపెట్టుకుని ఉండేవారు. వ్యాసుడు తరచుగా వచ్చి, కథలు చెప్పి పోతూండేవాడు. ఏ విషయంలో గాని ధర్మరాజు ధృతరాష్ట్రుడి మాటకు ఎదురు చెప్పేవాడు కాడు; ఆయనఏదికోరినా సమకూర్చేవాడు.భీముడు మాత్రం ధృతరాష్ట్రుడంటే కసిగా ఉండేవాడు.

ధృతరాష్ట్రుడు దానధర్మాలు చేసేవాడు, బ్రాహ్మణులకు అగ్రహారాలిచ్చేవాడు.

ఇలా పదిహేనేళ్ళు గడిచింది.ధృతరాష్ట్రుడికిగాని,గాంధారికిగానిఏలోటూలేకపోయినా, భీముడు అవకాశం దొరికినప్పుడల్లా అనే శూలాల లాటి మాటలు అప్పుడప్పుడూ వారి చెవిన పడి, బాధ కలిగేది. ఈ సంగతి ధర్మరాజుకు తెలియదు.

ఒకనాడు ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో, "నాయనా, ఇంతకాలమూ నన్ను ఎంతో బాగా చూశావు. ఎన్నో దానధర్మాలు చేశాను. క్షత్రియ ధర్మం అవలంబించి చనిపోయిన నా కొడుకులు ఉత్తమ లోకాలు పొందారు. వారికి నేను శ్రాద్ధాలు పెట్టాను. ఇక నావల్ల వారికి జరగదగిన మేలు ఏమీలేదు. నాకు లభించే పుణ్యం సంపాదించుకోవాలి.నువ్వు సరేనంటే, వానప్రస్థం పోదామనుకుంటున్నాను.గాంధారి కూడా నా వెంట ఉంటుంది. నేను వనంలో ఉండే నిన్ను ఆశీర్వదిస్తూ ఉంటాను," అన్నాడు.

అందుకు ధర్మరాజు ఒప్పుకోక, "నువ్వు వనంలో కష్టాలు పడుతుంటే నేను సుఖంగా రాజ్యం చెయ్యలేను. నువ్వు ఉపవాసాలు చేస్తూ, కటికనేల మీద పడుకుంటే నన్నూ, నా తమ్ములనూ లోకం నిందించదా? నాకీ రాజ్యం వద్దు, భోగాలు వద్దు. రాజ్యం యుయుత్సుడి కిస్తాను," అన్నాడు.

"నాకు తపస్సు చేసుకోవాలని ఉన్నది. మన వంశంవారికి వనవాసం పరిపాటే. నా వనవాసానికి నువ్వు ఒప్పుకోవచ్చు," అన్నాడు ధృతరాష్ట్రుడు. ఆయన వానప్రస్థం వెళ్ళాలని పట్టుబట్టటమే గాక, ధర్మరాజు అందుకు ఒప్పుకోకపోతే భోజనం చెయ్యనన్నాడు.

ఆ సమయంలో వ్యాసుడు వచ్చి ధర్మరాజుతో ధృతరాష్ట్రుణ్ణి వనానికి వెళ్ళనియ్యమన్నాడు. అప్పుడు ధర్మరాజు సరేనని, ధృతరాష్ట్రుడి చేత భోజనం చేయించాడు.

ధృతరాష్ట్రుడు వనవాసం వెళ్ళుతున్నట్టు తెలిసి, హస్తినాపురంలోని అన్ని వర్ణాలవారు ఆయనను చూడవచ్చారు. ధృతరాష్ట్రుడు ప్రజలతో, "నేనూ, గాంధారీ కలిసి వనవాసం పోబోతున్నాం. అందుకు మీరు అనుమతించాలి. దుర్యోధనుడి కంటే ధర్మరాజు బాగా పరిపాలిస్తున్నాడని నా నమ్మకం. ఈ భూమిని మొదట శంతనుడూ, తరవాత భీష్ముడూ, విచిత్రవీర్యుడూ పాలించారు. నేను కూడా మీకు కొంత సేవ చేశాను. ఎలా చేశానో నాకు తెలియదు. అందులో ఏవైనా లోపాలుంటే క్షమించండి. మా దుర్యోధనుడు దుర్బుద్ధి అయి క్షత్రియ వినాశం తెచ్చి పెట్టాడు. అందులో నా దోషం కూడా లేక పోలేదు. అదంతా మరిచిపొమ్మని నేను మీకు చేతులు



మోడ్చి వేడుకుంటున్నాను. ఇక నుంచీ ధర్మరాజు మిమ్మల్ని పరిపాలిస్తాడు," అన్నాడు.

ఈ మాట విని పౌరజానపదుల ప్రతినిధిగా ఒక బ్రాహ్మణుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, నువ్వు మా ఎడల ఎంతో మైత్రితో ప్రవర్తించావు. మీ వంశం వారెవరూ మాకు ఎలాటి లోపమూ చెయ్యలేదు. దుర్యోధనుడు కూడా మాకు ఎలాంటి ద్రోహమూ చెయ్యలేదు. యుద్ధం తెచ్చిపెట్టి నందుకు మేం దుర్యోధనుణ్ణి తప్పుపట్టం. కురుక్షయానికి దేవుడు తప్ప మరెవరూ కారకులు కారు. ధర్మరాజు సత్పురుషుడు. ఆయన మమ్మల్ని వెయ్యిఏళ్ళు పాలించాలని కోరుకుంటున్నాము," అన్నాడు.

మర్నాడు ఉదయం విదురుడు ధర్మరాజు వద్దకు వచ్చి, "ధృతరాష్ట్రుడు కార్తీక మాసంలో వనవాసం పోతాడు. పోయేముందు



ఆయన భీష్ముడికీ, సోమదత్తుడికీ, బాహ్లీకుడికీ, తన కొడుకులకూ, ద్రోణుడికీ, సైంధవుడికీ, మిత్రులకూ శ్రాద్ధాలు పెడతాడు. అందుకు కొంత ధనం కోరుతున్నాడు,'' అని చెప్పాడు.

ధనం ఇయ్యటానికి ధర్మరాజూ, అర్జునుడూ సంతోషంగా ఒప్పుకున్నారు. కాని భీముడు మాట్లాడలేదు. అర్జునుడు అతనితో, ''నువ్వు కూడా కొంత ధనం ఇయ్యి. ధృతరాష్ట్రుడు వానప్రస్థం వెళ్ళబోతూ, శ్రాద్ధాలకని మనని ధనం యాచిస్తున్నాడు. మనం ఒకప్పుడు ఆయనను రాజ్యం కోసం యాచించిన వాళ్ళమే కదా?'' అన్నాడు.

దానికి భీముడు, ''భీష్ముడికీ, సోమదత్తుడికీ, బాహ్లికుడికీ, భూరిశ్రవుడికీ, ద్రోణుడికీ, ఇతరులకూ శ్రాద్ధాలు చెయ్యటానికి డబ్బు ఇయ్యవచ్చు. కర్ణుడి కోసం కుంతి డబ్బు ఇస్తుంది. దుర్యోధనాదులకు దేనికి? వాళ్ళు ఉత్తమలోకాలకు పోకపోతేనేం? మనని పడరాని కష్టాలు పెట్టారే!'' అన్నాడు.

ధర్మరాజు భీముడితో, ''ఇక చాలించు!'' అని, విదురుడితో, ''ఈ భీముడు బాధపడనవసరం లేదు. ధృతరాష్ట్రుడు కోరిన ధనమంతా నేనే ఇస్తాను,'' అన్నాడు.

తరవాత ధృతరాష్ట్రుడు పెద్ద ఎత్తున శ్రాద్ధయజ్ఞం చేసి, ధర్మరాజు చేత అంతులేని దానాలు చేయించాడు. ఈ పని ముగిసిన మర్నాడు ధృతరాష్ట్రుడు గాంధారితో సహా కార్తీక పూజ చేసి, నారబట్టలు ధరించి వానప్రస్థం బయలుదేరాడు. ఆయనకు ముందుగా అగ్నిహోత్రాలు నడిచాయి. ఆయన వెంట కౌరవ,పాండవ స్త్రీలు బయలుదేరారు. కుంతి గాంధారిని చెయ్యి పట్టుకుని నడిపించింది. ద్రౌపదీ, సుభద్రా, పరీక్షిత్తుతో సహా ఉత్తరా, నగరంలోని స్త్రీలూ వెంట నడిచారు.విదురుడూ, సంజయుడూ, ధృతరాష్ట్రుడితోబాటువెళ్ళటానికి అనుమతిపొందారు.

ధృతరాష్ట్రుడు నగర ద్వారం దాటి, యుయుత్సుణ్ణీ కృపుణ్ణీ వెనక్కు తిరిగి వెళ్ళమన్నాడు. చివరకు ధర్మరాజు మాత్రమే మిగిలాడు. అతను కుంతితో, ''అమ్మా, నువ్వు తిరిగివెళ్ళు. నేను ఈ మహారాజు వెంట వెళతాను,'' అన్నాడు.

కాని కుంతి, గాంధారీ ధృతరాష్ట్రుల వెంట వెళ్ళ నిశ్చయించుకున్నది. ఆమె ధర్మరాజుతో, ''నాయనా, ఈ గాంధారీ ధృతరాష్ట్రులు నా అత్తమామల లాటివాళ్ళు. వీళ్ళను సేవిస్తూ, నేను కూడా తపస్సు చేసుకుంటాను,'' అన్నది.

పాండవులందరూ ఆమెను వారింపజూశారు. కాని ఆమె వారి మాట వినలేదు.

చేసేదిలేక పాండవులు ద్రౌపదితో సహా హస్తినా పురానికి తిరిగి వచ్చారు.

ధృతరాష్ట్రుడు సాయంకాలం దాకా నడిచి గంగాతీరాన ఒక చోట నిలిచాడు. బ్రాహ్మణులు అగ్నిహోత్రాలు చేశారు. తరవాత విదురుడూ, సంజయుడూ ఆయనకూ, గాంధారికీ దర్భలతో పడకలు ఏర్పాటు చేశారు.

విదురుడి సలహాపై ఆ గంగా తీరంలోనే ధృతరాష్ట్రుడికి పర్ణశాల ఏర్పాటయింది. అక్కడ కొద్దికాలం ఉండి, ధృతరాష్ట్రుడు కురుక్షేత్రంలోని ఒక ఆశ్రమం చేరాడు. అక్కడ శతయూపుడనే రాజర్షి ఉంటున్నాడు. ఆయన తన కొడుక్కు రాజ్యం అప్పగించి, వానప్రస్థం వచ్చేశాడు. ధృతరాష్ట్రుడు తపశ్చర్యలు సాగించాడు. ఆయనను చూడటానికి ఎవరైనా వచ్చినప్పుడు వారికి కుంతి సపర్యలు చేసేది. ధృతరాష్ట్రుడు తపస్సు చేసుకుంటూ, మధ్య మధ్య అనేక కథలు వింటూ ఉండేవాడు.

ధృతరాష్ట్రుడు వెళ్ళిపోవటంతో హస్తినా పురవాసులకు నగరంచిన్నబోయినట్టుతోచింది. వాళ్ళు ఆ ముసలి రాజును గురించే మాట్లాడుకోసాగారు. ఇక పాండవుల సంగతి వేరే చెప్పనవసరంలేదు. ధృతరాష్ట్రుడేగాక, తమతల్లి అయిన కుంతి కూడా వెళ్ళిపోవటంతో వాళ్ళు జీవచ్ఛవాలలాగా తయారయ్యారు.

అందరికన్నా ముందు బయటపడిన వాడు సహదేవుడు. అతను కుంతిని చూడాలని తహతహలాడసాగాడు. ద్రౌపది కూడా ధర్మరాజుతో, "ఆడవాళ్ళందరూ గాంధారీ ధృతరాష్ట్రులనూ, కుంతీదేవినీ చూడాలని కోరుతున్నారు," అన్నది.



వెంటనే ధర్మరాజు ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి ప్రయాణంఏర్పాటు చేశాడు. పౌరులురాదలచుకుంటేరావచ్చునని ఆయన ప్రకటించాడు. ఒక మహాసేన బయలుదేరింది. రథాల మీదా, గుర్రాల మీదా, ఒంటెల మీదా, కాలినడకనా జనం బయలుదేరారు. ఆడవాళ్ళు పల్లకీలలో ఎక్కి వెళ్ళారు. యుయుత్సుడూ, ధౌమ్యుడూ మాత్రం రాజభవనంలో ఉండిపోయారు.

పాండవుల రాక తెలిసి కొందరు ఆశ్రమవాసులు వారిని చూడవచ్చారు. ధర్మరాజు వారిని, "మా పెద్దతండ్రి ధృతరాష్ట్రుడు ఎక్కడ?" అని అడిగాడు.

ధృతరాష్ట్రుడు స్నానం చెయ్యటానికీ, పుష్పోదకాలు తీసుకురావటానికీ యమునా నదికి వెళ్ళినట్టు వాళ్ళు చెప్పారు. పాండవులు వాళ్ళు చెప్పిన మార్గంగా వెళ్ళి దూరాన ధృత

రాష్ట్రుణ్ణీ, గాంధారినీ, కుంతినీ చూశారు. సహదేవుడు వేగంగా పరిగెత్తివెళ్ళి, తల్లి కాళ్ళు పట్టుకుని ఏడవనారంభించాడు. ఆమె కూడా కన్నీరు కార్చుతూ, అతన్ని లేవనెత్తి, కౌగలించుకుని, సహదేవుడు వచ్చాడని గాంధారికి చెప్పింది.

తరవాత పాండవులూ, వారి భార్యలూ తన చుట్టూ కూచుని ఉంటే ధృతరాష్ట్రుడికి తాను మళ్ళీ హస్తినాపురంలో ఉన్నట్టే అనిపించింది. ఆశ్రమంలో ఉండే మునులు పాండవులను చూడవచ్చారు. సంజయుడు వారిని విడివిడిగా ఆ మునులకు పరిచయంచేశాడు. ధర్మరాజు ధృతరాష్ట్రుణ్ణి కుశల ప్రశ్నలు వేసి, "విదురుడు కనపడటం లేదేం? ఆయన ఎక్కడ?" అని అడిగాడు.

"విదురుడు తిండి మాని, ఘోర తపస్సు చేసి కృశించాడు. అతను దిగంబరుడుగా వనంలో సంచారం చేస్తూ, అప్పుడప్పుడూ కనిపిస్తున్నట్టు బ్రాహ్మణులు చెబుతున్నారు," అన్నాడు ధృతరాష్ట్రుడు.

ఆయన ఇలా అంటూండగానే దూరాన విదురుడు ఆశ్రమానికి తిరిగివస్తూ కనిపించాడు. ధర్మరాజు ఒంటరిగా విదురుడికేసి వెళ్ళాడు. విదురుడు కీకారణ్యం మధ్య కనబడుతూ, మరుక్షణం కనపడకుండా పోతూ ఉండటం గమనించి ధర్మరాజు, "అయ్యా, విదురా! నీ కోసమే వస్తున్నాను," అని కేకపెట్టి ముందుకు పరిగెత్తాడు.

విదురుడు అరణ్యం మధ్య ఒక శూన్య ప్రదేశంలో నిలిచాడు. "నేను ధర్మరాజును," అంటూ ధర్మరాజు ఆయనకు ఎదురుగా నిలబడ్డాడు. విదురుడు దాదాపు గుర్తించరానంతగా క్షీణించిపోయాడు. విదురుడు రెప్పవేయకుండా ధర్మరాజుకేసి చూడసాగాడు. విదురుడి శరీరం తన శరీరంతో చేరిపోతున్నట్టూ, విదురుడి ప్రాణాలు తన ప్రాణాలతో ఐక్యమవుతున్నట్టూ ధర్మరాజుకు అనుభూతి కలిగింది.

తరవాత కొద్ది సేపటికి విదురుడి శవం ఒక చెట్టుకు చేరగిలబడి ధర్మరాజుకు కనిపించింది. ధర్మరాజు విదురుడి కళేబరానికి దహనసంస్కారం చేద్దామనుకున్నాడు. కాని యతులకు దహనసంస్కారం లేదు. అందుచేత ఆ ప్రయత్నం మాని, ఆశ్రమానికి తిరిగివచ్చి, జరిగిన సంగతి అందరికీ తెలిపాడు. అందరూ అమితంగా ఆశ్చర్యపడ్డారు.



# చందమామ కబుర్లు



## "బ్రహ్మాండం!....మరెక్కడా చూడలేదు!"

ఇటీవల అలహాబాదులో జరిగిన కుంభమేళాకు గుమిగూడిన లక్షలాది జన సందోహాన్ని చూసి జపానుకు చెందిన మునెనోరీ ఇకెగ్యామీ ఆశ్చర్యంతో దిమ్మ తిరిగిపోయాడు. జపానులో జరిగే అతి పెద్ద ఉత్సవమైన 'గియాన్ మాటూరీ' గానీ, దక్షిణాఫ్రికాలో ఇటీవల జరిగిన సహస్రాబ్ది ఉత్సవంగానీ, ఆస్ట్రేలియాలో జరిగిన 'ఆబోరిజిన్స్' (ఆదిమనివాసుల) ఉత్సవంగానీ కుంభమేళా దరిదాపులకు రాజాలదని అతడు చెప్పాడు. అంత ఘంటాపథంగా ఎలా చెప్పగలుగుతున్నాడంటే, అతడు తను పని చేసే టీవీ కంపెనీ కోసం వాటిని చిత్రంగా తీశాడు. కుంభమేళాను కూడా అలాగే చిత్రంగా తీయమని తన కంపెనీ తనను ఆదేశిస్తుందని అతడు ఆశించాడు. అయితే,అది నెరవేరలేదు.అందువల్ల అతడు నిరాశతో ఉద్యోగానికి రాజీనామా చేసి ఇండియాకు వచ్చేశాడు. ఇప్పుడు అతడు తన స్వస్థలానికి చేరుకుని ఉద్యోగం వేటలో దిగాడు. కుంభమేళాలో తాను తీసిన వీడియో ఫిల్మును ఎవరికైనా అమ్మడానికి ప్రయత్నిస్తున్నాడు. తన ప్రయత్నం ఫలించినా, ఫలించకపోయినా తానుమాత్రం,మళ్ళీ 2013లో జరగనున్న కుంభమేళాకు తప్పకుండా వచ్చి తీరుతానని అతడు దృఢంగా చెబుతున్నాడు!

## కొడుకంటే ఎంత ప్రేమ!

బ్యాంకాక్‌లోని ఒక కంపెనీలో అధికారిగా ఉద్యోగం చేస్తూన్న కె.వై.వాంగ్‌కు కొడుకు వాంగ్‌యూకీ అంటే చెప్పలేనంత ప్రేమ. కొడుకు ఎంతో ప్రావీణ్యంతో వయొలిన్ వాయించడం చూసి తండ్రి తెగ మురిసిపోయాడు. ఆ కుర్రవాడు తనకు ఇటలీలో తయారైన 200 సంవత్సరాలనాటి లోరెన్జో స్టోరియోని వయొలిన్ కావాలని తండ్రికి చెప్పాడు. అదేం పెద్ద సమస్య కాదు. తప్పక కొనిపెడతానని తండ్రి కొడుక్కు నచ్చ చెప్పాడు. అయితే, దాన్ని కొనడానికి తన వద్ద తగినంత డబ్బులేక పోయేసరికి అతడు సింగపూర్‌లోవున్న తన ఇంటిని 3,64,000 అమెరికన్ డాలర్లకు అమ్మివేసి, కొడుకు కోరిన వయొలిన్ కొని అతనికి కానుకగా ఇచ్చాడు!





# చపలచిత్తం

ఒక రైతు నాగలి తీసుకుని, ఎడ్లను తోలుకుని పొలానికి వెళ్ళి, పొలం దున్నుకుంటూ ఉండగా నాగలికి ఏదో అడ్డు తగిలింది. తీసి చూస్తే ఒక కంచుపాత్ర దొరికింది. దాని నిండా బంగారం ఉన్నది.

అది చూసి రైతుకు మతి చలించినట్టయింది. ఆ బంగారంతో ఎన్ని పనులైనా చెయ్యవచ్చు,ఎంత గొప్పవాడైనా కావచ్చు. కాని అపాయం కూడా ఉన్నది. దొంగలకు తెలిస్తే దోచుకుపోతారు. అడ్డం వస్తే నిలువునా చంపేస్తారు.

ఇలాంటి విరుద్ధ ఆలోచనలతో రైతు సతమతమవుతూండగా, దూరంగా వెళుతూ న్యాయాధికారి కనిపించాడు. ఈ బంగారమంతా న్యాయాధికారికి ఇచ్చేస్తే తనకు ఏ భయమూ ఉండదనుకుని రైతు పరిగెత్తుకుంటూ వెళ్ళి న్యాయాధికారిని కలుసుకుని, ఆయనకు నమస్కరించి,దయచేసి ఒక్కసారి తన పొలంలోకి రమ్మని బతిమలాడాడు.

ఇద్దరూ కలిసి కంచుపాత్ర భూమిలో ఉన్నచోటికి వచ్చారు. అయితే ఇంతలోనే రైతుబుద్ధి మారిపోయింది. అతను ఆ పాత్ర మీదికి ఇంత మట్టి తోసి, న్యాయాధికారితో, "తమరు ఏదన్నా నిర్ణయించగలరు.నా రెండెద్దుల్లో ఏది మెరుగంటారు?" అన్నాడు.

ఈ ప్రశ్న విని న్యాయాధికారి చిరాకుపడి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

"ఆయనగారికి ఆ బంగారం ఎందుకిచ్చాను కాను? దీన్ని ఎవరికంటా బడకుండా ఎక్కడ దాచను?" అని రైతు మరింతగా భయపడ సాగాడు.

అతనికి పగలంతా ఈ సమస్యను గురించి ఆలోచించటంతోనే సరిపోయింది. పొలంపని ఏమీ జరగలేదు.

చీకటి పడబోతూ ఉండగా న్యాయాధికారి గ్రామానికి తిరిగి వస్తూ రైతుకు కనబడ్డాడు. రైతుకు ప్రాణం లేచివచ్చింది. వాడు పరిగెత్తుకుంటూ వెళ్ళి న్యాయాధికారిని

కలుసుకుని ఆయనను తన పొలంలోకి ఒక్క సారి అడుగుపెట్టమని ప్రాధేయపడ్డాడు.

న్యాయాధికారి ఏదో అక్రమం జరిగిందను కుని, రైతు వెంట వచ్చాడు. కాని అంతలోనే రైతు బుద్ధి మారిపోయింది. వాడు ఆయనతో, "తమరు అన్నీ తెలిసినవారు. చూడండి, నేను నిన్న దున్నిన ఆ చాళ్ళు బాగున్నాయా, ఇవాళ దున్నిన ఈ చాళ్ళు బాగున్నాయా?" అని అడిగాడు.

వాడికి మతిచలించిందనుకుని న్యాయాధి కారినవ్వుకుంటూతన దారినవెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళిపోగానే రైతు కుంగిపోయి, "ఆయనకు ఆ బంగారం ఎందుకిచ్చాను కాను? దీన్ని ఎక్కడ దాచను?ఎలా దాచను?" అని దిగులుపడ్డాడు.

చివరకు వాడు, తాను రోజూ తిండి తెచ్చు కునే గోతం సంచీలో ఆ బంగారంగల పాత్రను ఉంచి, వీపున వేసుకుని ఇంటికి వెళ్ళాడు.

వాడు తన భార్యతో, "ఏమే, కాస్త ఎడ్లను కట్టేసి, వాటి కింత మేతవెయ్యి. నేను తొంద రగా న్యాయాధికారిగారి ఇంటికి పోవాలి," అన్నాడు.

తన మొగుడు వీపు మీది సంచీ దించక పోవటం గమనించి, రైతు భార్య అందులో ఏదో రహస్యం ఉన్నదని గ్రహించింది. అదేమిటో తెలుసుకోవాలని పట్టుదల కలి గింది.ఆమె రైతుతో, "నాకిదే పనా? ఆవు లనూ,గొర్రెలనూ చూస్తున్నాను చాలదూ? నీ ఎడ్లను నువ్వే కట్టేసుకో. ఆ తరవాత నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళి, నీ ఇష్టం వచ్చిన ప్పుడు తిరిగిరా," అన్నది.



చేసేది లేక, రైతు వీపుమీది మూట కింద దించి ఎడ్లను కట్టెయ్యబోయాడు. వెంటనే రైతు భార్య మూటలో నుంచి కంచుపాత్ర పైకి తీసింది. దాని నిండా బంగారం! రైతు ఎడ్లను కట్టేసి, మేత వేసి తిరిగివచ్చేలోపుగా ఆమె ఆ పాత్రను దాచి, అదే ఆకారమూ బరువూగల రాయి ఒకటి తీసుకువచ్చి సంచీలో పెట్టింది.

రైతు పని ముగించుకునివచ్చి,మూటను వీపున పెట్టుకుని, తిన్నగా న్యాయాధికారి ఇంటికి వెళ్ళాడు.

"తమకు ఒక బహుమానం తెచ్చాను, దొరా!" అన్నాడు వాడు.న్యాయాధికారి అది ఎంతవిలువైన బహుమానమో అనుకుంటూ సంచీ తీసి చూసేసరికి రాయి కనిపించింది.

న్యాయాధికారితో పాటు రైతు కూడా ఆశ్చర్యపోయాడు. రైతు ప్రవర్తనకు ఏదో బల మైన కారణం ఉంటుందని తోచి న్యాయాధి కారి ఆ రాత్రి వాణ్ణి ఒక కొట్లో బంధింపజేసి,

రాత్రి వాడు ఏం మాట్లాడుకుంటాడో, ఏం చేస్తాడో గమనించమని ఇద్దరు జవానులను నియోగించాడు.

రైతు ఆకొట్లో కూచుని పైకి వినబడకుండా గొణుగుతూ,చేతులతో అభినయిస్తూ, ''ఇంత చెంబు! ఇంత ఎత్తు! దాని నిండాబంగారమే!, సందేహం లేదు.నిజంగా బంగారమే!'' అను కున్నాడు.

జవానులు న్యాయాధికారితో రైతు చేతు లతో చేసిన అభినయం వివరించి చెప్పారు. న్యాయాధికారి వాణ్ణి తన వద్దకు తీసుకు రమ్మని జవానులకు చెప్పి, వాడు రాగానే, ''చేతులతో ఏదో కొలుస్తున్నావట! ఏమిటా కొలిచేది?'' అని అడిగాడు.

రైతు న్యాయాధికారితో, ''తమరి కొలతలే తలుచుకుంటున్నాను దొరా. తమరి తల ఇంత లావుంటుంది. తమరి మెడ ఇంత మందం ఉంటుంది. తమరి పొట్ట ఈపాటి ఉంటుంది,'' అన్నాడు.

న్యాయాధికారికి పట్టరాని ఆగ్రహం వచ్చి, ''ఈ వెధవను వెంటనే ఉరి తీసెయ్యండి,'' అని జవానులను ఆజ్ఞాపించాడు.

వాళ్ళు రైతును తీసుకుపోయి,ఉరికంబం ఏర్పాటు చేసి, తాడు బిగించి, ఉచ్చు మెడకు తగిలించ బోతూండగా రైతు, ''ఆగండి, న్యాయాధికారిగారికి ఒక మాట చెప్పాలి,'' అన్నాడు.

జవానులు వాణ్ణి న్యాయాధికారి దగ్గరికి తీసుకుపోయి, వాడి చివరి కోరిక ఆయనకు నివేదించారు.

''ఏమిటినువ్వు నాకు చెప్పాలనుకున్నది?'' అని న్యాయాధికారి రైతును అడిగాడు.

''చూడు,దొరా! మీమనుషులు ఆఉచ్చు నా మెడకు బిగిస్తే నాకు ఊపిరి ఆడేదికాదు,'' అన్నాడు రైతు.

న్యాయాధికారికి నవ్వు ఆగలేదు. ''ఆ వెధ వను వదిలెయ్యండి,'' అన్నాడాయన.

రైతు ఇంటికి తిరిగి వెళ్ళి బంగారం పెట్టు కుని తన భార్యతో సుఖంగా జీవిం చాడు.



# పరీక్షలంటే భయమెందుకు?




"వచ్చే నెలలో ఫైనల్ పరీక్షలు. పాఠాలన్నీ ఇప్పటి నుంచే జాగ్రత్తగా చదవాలి!" అన్నది టీచర్ లతాశంకర్.

తరగతి గదినంతా ఒక్క నిమిషం నిశ్శబ్దం ఆవరించింది. జీవితమంతా హఠాత్తుగా విచార గ్రస్తమైనట్టయింది.ముందువరుసలో కూర్చున్న మీరా అరచేతుల్లో చెమటలు పోశాయి. ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఆమెకు ఒక్క సారిఏడవాలనిపించింది.అక్కడినుంచిదూరంగా, పరీక్షలకు దూర దూరంగా పరిగెత్తి పారిపోవా లనిపించింది.

మీరాకు పరీక్షలంటే మహాభయం; పెద్ద బెదురు. అవి ఆ అమ్మాయికి చిల్లర మల్లర రోగాలు కూడా తెచ్చి పెడతాయి. వ్యాసాలు రాయడం అన్నా, పాఠాలు అప్పగించడమన్నా ఆమెకు ఇష్టమే. అయితే పరీక్షల పేరు చెబితే చాలు. కడుపులో తిప్పినట్టవుతుంది. మన సును చెప్పలేని విచారం, భారం ఆక్రమిస్తాయి. చదివినదంతా ఒక్కసారిగా మరిచిపోయినట్టు భ్రమ.

పరీక్ష సమయంలో ఆమెకు తరగతి గది వింతగా, భయంగా కనిపించింది. ఎప్పుడూ గలగలా నవ్వుతూ సరదగా పలకరించే ఆమె స్నేహితులు కూడా బిగుసుకుపోయి దూరమై పోయారు. ఉపాధ్యాయులు కూడా వాళ్ళ వాళ్ళ పనుల్లో నిమగ్నులైపోయి తనను పట్టించుకో నట్టు కనిపించారు. ఆమెను చూసి ఒక్కరూ చిన్నగా నవ్వను కూడాలేదు. పలకరింపులు లేవు. మీరా ప్రశ్న పత్రం అందుకున్నది. చేతులు వణికాయి. కొంతసేపటికి అందులో ఉన్న వాటిని మెల్లగా చదివింది. పరీక్షలకు ఆమె ఎంతో కష్టపడి చదివి ఉన్నప్పటికీ, అనుకున్నంత బాగా రాయలేకపోయాను కదా అని దిగులు పడిపోయింది.

పరీక్షలు వస్తున్నాయని చెప్పగానే మీరెలా స్పందిస్తారు? మీరా లాగా హడలిపోతారా? పరీ క్షల గొడవే లేకుండా వుంటే బావుణ్ణు కదా అని అనుకుంటున్నారా? అయితే, ఈ పేజీలను ఒకసారి తప్పకుండా చదవండి.

## పట్టుదల అంటే.....

1. నా ప్రయత్నం సరైనదని నేను భావించినంత కాలం నా ప్రయత్నాన్ని మానుకోను. పట్టుదల వదులుకోను.
2. నేను తుదివరకూ పోరాడితే సర్వశక్తులూ నాకు అనుకూలంగా ప్రవర్తిస్తాయని విశ్వసిస్తాను.
3. ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా భయపడను. ధైర్యంగా ముందుకు సాగుతాను.
4. నా లక్ష్యం నుంచి వైదొలగాలని నన్ను బెదిరించేవారినీ, ఆటంకపరచడానికి ప్రయత్నించే వారినీ అనుమతించను.
5. భౌతిక ప్రతిబంధాలనూ, లోపాలనూ అధిగమించడానికి పోరాడతాను.
6. నా కోరికను సాధించడానికి నేను మళ్ళీ మళ్ళీ ఇంకా మళ్ళీ ప్రయత్నిస్తాను.
7. మోసాలనూ, ద్రోహాలనూ; కష్ట నష్టాలనూ ఎదిరించి పోరాడి ఘన విజయాలు సాధించిన మహాను భావుల నుంచి పాఠాలు నేర్చుకుంటాను. నవచైతన్యం నాలో నింపుకుంటాను.
8. ఎన్ని అవరోధాలు ఎదురైనప్పటికీ నిరుత్సాహానికీ, నిరాశకూ లొంగిపోను.

— హెర్మన్ షెర్మన్

# పరీక్షల భయం అంటువ్యాధి లాంటిది!

మీలో భయం ఎప్పుడు కలుగుతుంది? మీ చుట్టూ వున్నవాళ్ళు భయపడితే మీలోనూ భయం కలగవచ్చు. చాలామంది విద్యార్థులు పరీక్షలంటే ఎందుకు భయపడతారో తెలుసా? వాళ్ళ స్నేహితులు భయపడతారు గనక! ఈ భయం అనేది ఫ్లూలాగా, జలుబులాగా ఒకరి నుంచి మరొకరికి సులభంగా వ్యాపిస్తుందన్నమాట!

పరీక్షలంటే భయం కలగడానికి ఇంకొక కారణం కూడా ఉన్నది. మనం సరిగ్గా పాఠాలు చదవలేదు. ప్రశ్నలకు సరైన సమాధానాలు రాయగలమో లేదో అన్న అనుమానమే అది! అయినా, పరీక్షలంటే భయపడవలసిన అవసరం ఏమాత్రం లేదు. చదువులో అది ఒక భాగం మాత్రమే!

## మహేష్ - పనిభారం!

వచ్చే సోమవారం గణితం రివిజన్ టెస్ట్ అని గురువారమే మహేష్‌కు తెలిసింది. ఆ లెక్కలను అతడు రెండు వారాలుగా నేర్చుకుంటున్నాడు. ఇప్పుడు కొన్ని లెక్కలు వేసి చూశాడు. వాటిలో తనకు తెలియనివి చాలా ఉన్నాయి. అతడు వదలకుండా హోమ్ వర్క్ చేశాడు. కానీ, టీవీ చూస్తూ చేశాడు. హోమ్ వర్క్ పుస్తకాలు సరిదిద్ది వచ్చినప్పుడు తప్పులు ఏవి? ఒప్పులు ఏవి? అని సరిచూసుకోవాలనే శ్రద్ధ కూడా కనబరచలేదు. ఒక్కోసారి అయితే, హోమ్ వర్క్‌ను తన స్నేహితుడి నోటు పుస్తకం నుంచి కాపీ చేసి ఇచ్చాడు కూడా.

ఆదివారం రాత్రి పుస్తకాలు ముందుంచుకుని కూర్చున్నాడు. యూనిట్‌లోని లెక్కలన్నిటినీ ఒక్కసారిగా చేసేయవచ్చని ఆశపడ్డాడు. అయితే లెక్కల పుస్తకం తెరిచి చూస్తే మహాపర్వతంలాగా కనిపించింది. లెక్కలు కూడా అంత సులభంగాలేవు. వాటిలో మూడోవంతు చేసేసరికి నడుం నొప్పి పుట్టింది. రాత్రి చాలా పొద్దుపోవడంతో నిద్రముంచుకువచ్చింది. బాగా తెలిసిన లెక్కలు కూడా మరొకసారి చేసి చూడడానికి అవకాశం లేకుండాపోయింది. ఇంకా వేయవలసిన లెక్కలు తరగని కొండలా భయపెట్టాయి. భయం, దడ పోటీ పడి అతన్ని గడగడలాడించాయి. అంతలో అతని తల్లి వచ్చి, "ఇంకా మేలుకొని ఉన్నావేంటి? పొద్దున లేచి స్కూలుకు వెళ్ళడానికి ఆలస్యమవుతుంది, వెళ్ళి పడుకో!" అని లేపి పడుకోబెట్టింది. తెల్లవారగానే హడావుడిగా లేచి బడికి వెళ్ళాడే తప్ప, టెస్ట్‌లో తనకు తెలిసిన లెక్కలను కూడా సరిగ్గా వేయలేకపోయాననే అని ఇంటికి వచ్చాక బాధపడిపోయాడు. ఆ రోజు నుంచి క్రమం తప్పకుండా కష్టపడి చదివి ఫైనల్ పరీక్షలకైనా ఇలాంటి గందరగోళం రాకుండా చూసుకోవాలని గట్టిగా నిర్ణయం తీసుకున్నాడు.




మీరు అన్నిటినీ ఆఖరి నిమిషం వరకు వాయిదా వేస్తూ వచ్చారంటే-చదవవలసిన పాఠాలను చదవడం సాధ్యంకాదు. అర్థం చేసుకోవడం అసలు వీలు పడదు. కాబట్టి కంఠస్థం చేయాలనుకుంటారు. అది ఒక్క రోజులో సాధ్యమయ్యేపనికాదు. వాటిని జ్ఞాపకం పెట్టుకోవడం చాలా కష్టం. తీరా పరీక్ష రాసేటప్పుడు భయం పుట్టుకువచ్చి అయోమయ పరిస్థితి ఏర్పడుతుంది. ఈ సమస్యలన్నిటికీ రోజూ క్రమబద్ధంగా చదవడం ఒక్కటే పరిష్కారం. అదే విజయానికి రాజమార్గం!





# మీకు ఉపయోగపడే కొన్ని చిట్కాలు



## సంవత్సరమంతా....

- తరగతిలో ఉపాధ్యాయులు చెప్పే పాఠాలు శ్రద్ధగా వినాలి.
- నోట్సు, క్లాస్‌వర్క్, ఉపాధ్యాయులు చెప్పే ముఖ్యాంశాలను వాయిదా వేయకుండా అప్పటికప్పుడు రాసుకుంటూ ఉండాలి.
- హోమ్‌వర్క్ చేయడం మానకూడదు. ఉపాధ్యాయుల సూచనలు పాటిస్తూ, ఏరోజు పాఠాలు ఆరోజే చదివేయాలి.

ఈవిధంగా చేయడం వల్ల పరీక్షలకు ముందు నోట్సు, ముఖ్యాంశాలు, పుస్తకాలలోనూ, వర్క్ షీట్స్‌లోనూ ఇచ్చిన ప్రశ్నలకు సమాధానాలు మాత్రం చదువుకుంటే చాలు. సంవత్సరమంతా పాఠాలన్నిటినీ క్రమం తప్పకుండా చదివి ఉండడం వల్ల, వాటిలోని విషయాలన్నీ మీకు తెలిసినవే.ఏప్రశ్నకైనా సులభంగా సమాధానం రాయగలుగుతారు.



## పరీక్షలకు ముందు

- పరీక్ష లు ఇంకా ఒక నెల ఉందనగానే రివిజన్ అంటే పునశ్చరణ మొదలు పెట్టండి.
- పునశ్చరణను ఒక ప్రణాళిక ప్రకారం చేయండి.
- ఆ ప్రణాళికలో ప్రతి పాఠ్యాంశానికీ నిర్దిష్ట సమయం కేటాయించండి.
- అధ్యాయాలన్నిటినీ కనీసం ఒక్కసారైనా పునశ్చరణ చేయండి.

## పునశ్చరణ చేయడం ఎలా?

- పాఠాలన్నిటినీ ఒకసారి చదవండి.
- వాటిలోని ప్రధాన అంశాలను క్షుణ్ణంగా అర్థం చేసుకోండి.
- ప్రధాన అంశాలను క్లుప్తంగా అంటే వాటి సారాంశాన్ని రాసుకోండి.
- మామూలు ప్రశ్న పత్రం ఎలా ఉంటుందో పరిశీలించండి.
- ప్రశ్నలన్నిటికీ నిర్ణీత సమయంలో సమాధానాలు రాసి పూర్తి చేయడం అలవాటు చేసుకోండి.
- సమాధానాలను అర్థం చేసుకుని చదవండి. కంఠస్థం చేయడం,ఒట్టినే బట్టీపట్టడం మంచి పద్ధతి కాదు.

ఫైనల్ పరీక్షలకు ముందు నోట్సును జాగ్రత్తగా చదువుతూ, ప్రశ్నలకు సమాధానాలు రాసి చూడండి. ఇది చాలా ముఖ్యం. కేవలం చదువుకుంటూ పోవడంకన్నా, ఒకటికి రెండుసార్లు రాసి చూడడం ఎక్కువ ఉపయోగం. ఇలా అభ్యాసం చేయడం వల్ల ప్రశ్న పత్రంలో ప్రశ్న కనిపించగానే, మనసులో సమాధానం స్ఫురిస్తుంది. మీ చేయి దానంతట అది సునాయాసంగా సమాధానం రాసుకుంటూ పోతుంది!



## పరీక్షకు ముందు రాత్రి

- చివరి నిమిషంలో బట్టీపట్టకండి.
- ముఖ్యాంశాలను ఒకసారి నెమ్మదిగా చదవండి. చదివిన వాటిని ఒకసారి మనసులోనే మననం చేసుకోండి.
- మంచి భోజనం చేయండి. విశ్రాంతి తీసుకోండి.
- పెందలాడే నిద్రకు ఉపక్రమించండి.

కొత్తగా పాఠాలు చదవడానికీ,సమాధానాలు నేర్చుకోవడానికీ ఇది సమయంకాదు. ఇప్పటికే మీరు చాలా చదివి ఉంటారు. చదవని వాటిని ఆఖరి నిమిషంలో బట్టీ పట్టాలని హడావుడి పడడంవల్ల త్వరగా అలసిపోతారు. అది మీలో భయం పుట్టిస్తుంది. అందువల్ల, ఈ రాత్రి నెమ్మదిగా చదివినంత చదివి, హడావుడి పడకుండా ప్రశాంతంగా నిద్రపోవడం మంచిది. పొద్దున ప్రశాంత చిత్తంతో పరీక్షకు హాజరు కావడానికి అది ఉపకరిస్తుంది.

## పరీక్ష హాలులో

- ప్రశాంతంగా ఉండండి.
- అన్ని ప్రశ్నలనూ, సూచనలనూ జాగ్రత్తగా చదవండి.
- ఒక్కొక్క ప్రశ్నకు సమయాన్ని కేటాయించండి. రాసిన వాటిని ఒకసారి తిరిగి చదువుకోవడానికి కొంత సమయం కేటాయించండి.
- మీకు బాగా తెలిసిన ప్రశ్నలన్నిటికీ మొదట సమాధానాలు రాయండి.
- ఆ తరవాత తెలియని ప్రశ్నల వైపు దృష్టి మళ్ళించండి. అలాంటి ప్రశ్నలను ఒకటికి రెండు సార్లు చదివి అవి ఏ పాఠానికి సంబంధించినవో జాగ్రత్తగా ఆలోచించండి. ఆలోగా మీకు సమాధానం స్ఫురించవచ్చు. తెలిసిన మేరకు రాయండి.




- ఒకే ప్రశ్నకు ఎక్కువ సమయం వెచ్చించకండి.
- ప్రశ్నలన్నిటికీ సమాధానాలు రాసి పూర్తి చేశాక-ఇంకా సమయం మిగిలి ఉన్నట్టయితే, మీ సమాధానాలు సరిచూసుకోండి. అక్షరాల తప్పులు ఏవైనా దొర్లాయేమో ఒకసారి చదివి చూసుకోండి.




ఆత్మవిశ్వాసంతో ఈ సూచనలు పాటించండి!
పరీక్షలలో ఘనవిజయం సాధించండి!!

## గుర్తుంచుకో తగిన మాటలు

ఒక్క డిక్షనరీలో మాత్రమే 'పని'కి ముందు 'విజయం' కనిపిస్తుంది. జీవితంలో కష్టపడి పనిచేశాకే విజయం సిద్ధిస్తుంది. మొదట కృషి; ఆ తరవాతే విజయం. కష్టపడి పనిచేయడం అనే మూల్యం విజయానికి మనం తప్పక చెల్లించాలి. తగిన మూల్యం చెల్లించడానికి సిద్ధమయితే మీరు దేన్నయినా సాధించవచ్చు. —విన్స్ లోంబార్డీ

మీరు దేనిని సాధించగలరు అన్నదానిని మీ సమర్థత నిర్ణయిస్తుంది. మీరు ఏమి చేయగలరు అన్నదానిని మీ సంకల్పం నిర్ణయిస్తుంది. మీరు ఎంత బాగా చేయగలరు అన్నదానిని మీ వైఖరి నిర్ణయిస్తుంది. —లోవ్ హోల్ట్జ్

మరింత బాగా చెయ్యాలి, అనే నిరంతర ప్రయత్నమే క్రమేణా నైపుణ్యంగా పరిణమిస్తుంది. —ప్యాట్ రైలే

రాత్రింబవళ్ళు నిరంతరాయంగా సాగే చిన్న చిన్న ప్రయత్నాల సమాహారమే విజయం! —రాబర్ట్ కోలియర్

ఇదొక చందమామ కానుక!

# అజేయుడు గరుడుడు!

3

చిత్రాలు:పాణి

చంద్రపురి రాజు మహేంద్రదేవుడు, ప్రధాన మంత్రి అకస్మాత్తుగా మరణించడంతో, గురుకులంలో విద్యనభ్యసిస్తున్న ప్రధానమంత్రి కుమారుడు ఆదిత్యుణ్ణి రప్పించి, తన సలహాదారుగా నియమించాడు. రాజ్యంలో దోపిడీలకు పాల్పడిన బందిపోటు దొంగలను ఆదిత్యుడు ఉపాయంతో పట్టి, చెరసాలలో బంధించాడు. ప్రధానమంత్రి స్నేహితుడి కూతురు అరుణ, ఆదిత్యుడి దగ్గరికి వచ్చి, తన తండ్రి కూడా మంత్రి మరణించిన రోజే మరణించాడని చెప్పి, ఒక పెట్టెను ఆయనకు అందించింది. ఆ పెట్టెలో ప్రధానమంత్రి స్వహస్తాలతో రాసిన ఒక గ్రంథం కనిపించింది. ఆదిత్యుడు దానిని చదవసాగాడు.

వినత ఒక పందెంలో కద్రువతో ఓడిపోయిన కారణంగా ఆమె, ఆమె కుమారుడైన గరుడుడూ-కద్రువకూ, ఆమె సంతానమైన నాగులకూ సేవ చేయవలసివచ్చిన దుస్థితిని, కుమారుడైన గరుడుడికి వివరించింది. గరుడుడు కద్రువ దగ్గరికి వెళ్ళి తనకూ, తన తల్లికీ దాస్యవిముక్తి కలిగించమని ప్రార్థించాడు.

"నువ్వు దేవలోకానికి వెళ్ళి అమృతం తెచ్చి ఇచ్చినట్టయితే, నువ్వూ, నీ తల్లీ మాకు సేవ చేయవలసిన అవసరం లేదు. విడిచి పెడతాను!"


గరుడుడు దేవలోకానికి వెళ్ళాడు. అమృత కలశాన్ని రెండు మహాసర్పాలు కాపాడుతూ ఉన్నాయి. వాటి చుట్టూ మంటలు. దానిని దేవతలు రక్షిస్తున్నారు. గరుడుడు వాళ్ళతో యుద్ధం చేసి ఓడించి, మంటలను ఆర్పి, చుట్టూ ఉన్న సర్పాలను చంపి అమృత భాండాన్ని చేజిక్కించుకుని భూలోకానికి వెనుదిరిగాడు.
...అది తెలిసిన ఇంద్రుడు గరుడుడిపై వజ్రాయుధం ప్రయోగించాడు. దానిదెబ్బకు గరుడుడి రెక్కలకు ఉన్న ఒకే ఒక్క ఈక మాత్రం రాలింది. గరుడుడు అజేయుడని ఇంద్రుడు గ్రహించి అతనితో సంధి చేసుకున్నాడు.
"అమృతం దేవతల కోసమే ఉద్దేశించబడింది. దానిని ఇతరులకు ఇవ్వవద్దు."


'నేను దానిని నా సవతి తల్లికి ఇవ్వక తప్పదు. అప్పుడే నా తల్లికీ, నాకూ ఆమె దాస్య విముక్తి కలిగిస్తుంది!''
''అయితే, నాగులు తాగక ముందే అమృతాన్ని నేను సురక్షితంగా దేవలోకానికి చేరుస్తాను!''
అమృతకలశాన్ని చూడగానే కద్రువ ఆనందంతో పొంగిపోయింది.గరుడుడూ, ఆమె తల్లీ ఇకపై తనకు సేవ చేయ నవసరం లేదని చెప్పింది. నాగులు అమృతకలశాన్ని సమీపించడానికి ప్రయత్నిస్తూండగా, గరుడుడు దానిని ఎత్తుకుని ఆకాశంలోకి ఎగిరిపోయాడు.



ఇంద్రుడి వజ్రాయుధం తాకిడికి రాలిన గరుడుడి ఈక, హిమాలయాలలోని ఒక ముని కంట బడింది. ఆయన దానిని చిరకాలం పూజించి మన పూర్వీకులకు అప్పగించాడు. వారందరూ రాజులే. దానిని భక్తి శ్రద్ధలతో పూజించారు. ఆ ఈక ఆరవతరం వీరుడికి లభిస్తుంది, అతడు గొప్పవాడు అవుతాడు అన్నది విధి నిర్ణయం. నాయనా, ఆదిత్యా! నువ్వే ఆ ఆరవ తరానికి చెందిన అదృష్టపురుషుడివి!







నా అనంతరం నువ్వు దానిని పొందగలవు. ప్రతి పౌర్ణమిరోజూ దానిని భక్తి శ్రద్ధలతో పూజించు. అది నీకు మరింత బలాన్నీ, అతీత శక్తులనూ ప్రసాదిస్తుంది. ఆ శక్తులను నువ్వు ప్రజల సంక్షేమానికి ఉపయోగించు. గరుడుడు తన తల్లికి దాస్యవిముక్తి కలిగించిన విధంగా, నువ్వు నిన్ను కన్న చంద్రపురికి కష్టాలనుంచి విముక్తి కలిగించాలి. నాకు వ్యతిరేకంగా ఏవో కొన్ని అదృశ్యశక్తులు పనిచేస్తున్నాయి. నా అంతిమ ఘడియలు అట్టే దూరంలో లేవు. నాయనా, ఆదిత్యా! గరుడ భగవానుడు నిన్ను రక్షించుగాక!






–ఇంకావుంది

**Statement about Ownership of CHANDAMAMA (Telugu)**

Rule 8 (formVI), Newspaper (Central) Rules, 1956

| | |
|---|---|
| 1. Place of Publication | 82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |
| 2. Periodicity of Publication | MONTHLY<br>1st of each calendar month |
| 3. Printer's Name<br>Nationality<br>Address | B. VISWANATHA REDDI<br>INDIAN<br>82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097. |
| 4. Publisher's Name<br>Nationality<br>Address | B. VISWANATHA REDDI<br>INDIAN<br>82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |
| 5. Editor's Name<br>Nationality<br>Address | B. VISWANATHA REDDI (Viswam)<br>INDIAN<br>82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |
| 6. Name and Address of individuals who own the paper | Chandamama India Ltd.<br>Board of Directors:<br>1. Vinod Sethi<br>2. B. Viswanatha Reddi<br>3. P. Sudhir Rao<br>82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |

*I,* **B. Viswanatha Reddi,** *do hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

1st March 2001

B. VISWANATHA REDDI
*Publisher*



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ







ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 25వతేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు జూన్ 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

ఫిబ్రవరి 2001 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
శ్రీమతి ఎన్.జ్యోత్స్న W/o ఎ.ప్రభుకుమార్
23,భారతి నగర్, అయనావరం,
చెన్నయ్-600 023.

బహుమతి పొందిన వ్యాఖ్యలు





బూరల పాపకు బ్రతుకే భారం!
పూల మొక్కలకు ఏదీ బేరం?

# 'పరోపకారి పాపన్న'

## కథలు

చందమామలో ఆబాలగోపాలాన్ని అలరించినట్లే, ఇప్పుడు బుల్లితెరపై గత నాలుగైదు వారాలుగా మీ హృదయాలను దోచుకుంటూన్న 'పరోపకారి పాపన్న' మరిన్ని ఆసక్తికరమైన సన్నివేశాలతో వారం వారం మీ ముందుకు వస్తున్నాడు!




**పరోపకారి పాపన్న**

ప్రతి గురువారం రాత్రి 7-30 గంటలకు హైదరాబాదు దూర దర్శన్ (డిడి1)లో ప్రసారం!



ఇది వి.యస్.ఎన్. కమ్యూనికేషన్స్ వారి కానుక!